ప్రధాన సంపాదకులు
**ఆచార్య కె.ఇ.దేవనాథన్,** ఉపకులపతులు

# ఋషుల గాథలు

(ప్రథమ సంపుటము)

సంకలనము
'ప్రజ్ఞారత్న'
**డా॥ విద్వాన్ అమరవాది శేషయ్య**
పరియోజన అధికారి
పరిశోధన - ప్రకాశన విభాగము

శ్రీ వేఙ్కటేశ్వర వేద విశ్వవిద్యాలయము
తిరుపతి - 2017

**Chief Editor**
**Prof. K.E. DEVANATHAN, Vice-Chancellor**

# ṚṢULA GĀTHALU

## (PART-1)

**Compiled By**
**Dr. AMARAVADI SESHAIAH**
**Project Officer**

**SRI VENKATESWARA VEDIC UNIVERSITY**
**( Sponsored by the T.T.D., and Recognized by the U.G.C )**
**Alipiri - Chandragiri Bypass Road**
**Tirupati - 517 502**
**2017**

# పీఠిక

శ్రీ గురుభ్యో నమః

శ్రీ గణాధిపతయే నమః

"వేదవాఙ్మయ జ్ఞానమహేశ్వరంబన
వేదర్షి ఋషీశ్వర చరిత ఖ్యాతిగ
వేదసార భరిత సంస్కృతి వెల్గొంద
వేదజ్ఞ పాదంబుల ప్రణతులర్పింతు"

మహర్షుల చరిత్రలు మహితాత్మములు, మహర్షులు మహత్కార్యములకై భువిలో అవతరించెదరు. వారి జప, తప, యజ్ఞ, యాగాది క్రతువుల సమాహారమే తపోఫలదీక్షఫలితాంశపుణ్య ఫలములు. అలాగే పవిత్రమైన గంగానది ప్రవాహములే వారు మనకు అందించిన ఋక్కులు. ఋక్కులను ప్రవచింపచేయువారే ఋత్విజులు. వేద, శాస్త్ర, పురాణ, ఇతిహాస, కావ్యాదులే భారతీయ సంస్కృతికి పునాదులు. మన భరతభూమి వేద భూమి. నైమిశారణ్యాది వనముల ఆశ్రమవాసులై ఋషులు లోకకళ్యాణముకోసమై తపోదీక్షను చేపట్టారు.

కావున రాబోయే యువతకు జ్ఞానసంపదను అందించుటలో ఋషిప్రోక్తమైన మన హైందవ సంస్కృతిని భావి భారత జ్ఞానవాహినీ కోవెలలుగా తీర్చిదిద్దుటకు ఆచార్యులుగ పూర్వకాలమున మహర్షులు నదీప్రవాహ గట్లలో ఆశ్రమములను ఏర్పరచుకొని వివిధ శిష్యకోటితో వేదాభ్యాసమును చేయించిన ప్రాంతములే నైమిశారణ్యాది ప్రదేశములు.

ఇక నైమికారణ్య పూర్వగాథ ఇంచుక అవగాహనగా ఇతి వృత్తమును ఇలా తెలుసుకుందాము.

పూర్వము ఒకప్పుడు ఋషులు, బ్రహ్మను భూభాగమున అనువైన ప్రదేశము తమ తపోదీక్షకు చూపమనగా బ్రహ్మ తాను చక్రమును విసరగా, అది సరాసరి భారత భూభాగమున మధ్యప్రదేశమున పడి భూమిలోనికి చీల్చుకొనిపోయినది. కావున బ్రహ్మ యొక్క నిమి(చక్రము) పడిన చోటును "**నైమిశారణ్యముగ**" నాడు ఋషులు తమ తపస్సునకు అనుకూలమైన ప్రదేశముగ ఎంచుకొనిరి. అదే నేడు నైమిశారణ్యముగ మారినది. నాడు సూత శౌనకాది మహర్షులు ఎందరో దీనిని ఆలంబనగ చేసుకొని తమ తపో దీక్షతో యజ్ఞయాగాది కార్యములను సలిపారు. అలాగే వేదవ్యాసుడు కూడ 18 పురాణములను విరచించెనని ప్రతీతి. కాన అంతటి మహెూన్నత మైన ఋషులు వారి జన్మ వివరము లను, వారి గొప్పతనము, వారి మహిమలతో సాగిన నాటి ఔన్నత్య విశేషము లను సంగ్రహీకరణముగ రాబోయే తరము వారికి ఒక జ్ఞానసంపద భాండాగారముగ అందించుటయే నా రచనోద్దేశ్యపు మౌలికాంశముగ చేయు చిన్ని ప్రయత్నము. అష్టోత్తర శతనామావళిగ, అష్టోత్తరశతనామ మాలికగ ఆ వేంకటేశ్వరునికి అష్టోత్తర శత దివ్య పుష్పమాలికను భక్తి పురస్సరముగ సమర్పించుటయే ఈ ఋషుల చరిత్రలు - సంగ్రహ పరిశీలన రచనోద్దేశ్యము.

వ్యాసుడు రాసిన 18 పురాణములను సూతుడు, శౌనకాది ఋషులకు నైమిశారణ్యమున చెప్పినట్లు జన ప్రతీతి. అందువలన ఈ నా పొత్తమును మహత్కార్యముగ దైవాంశ సంభూతులై భువినవతరించిన ఋషుల గాథలు - శీర్షికలో 108 మంది దివ్య ఋషుల గాథలను 9 సంపుటములుగ సామాన్య మానవాళికి జన వ్యవహారిక భాషలో అర్థమగునట్లుగ విషయమును అందించుటయే నా ప్రథాన ఉద్దేశ్యము.

ఇక మొదటి సంపుటములో 6 మంది ఋషుల గాథలను గురించి మనము తెలుసుకుందాము.

*******

# కృతజ్ఞతలు

'**ఋషులు గాథలు**' ఈ గ్రంథ సంకలనము కీర్తిశేషులు **శ్రీవిద్వాన్ బులుసు వెంకటేశ్వరులు,** 1970లో రచించిన 'మహర్షుల చరిత్రలు' మహోదాత్తమైన ఈ గ్రంథమునకు ఉపలబ్ధ గ్రంథ సూచికగా నాకు ఉపయోగ పడినది. ఇది ప్రాచీన భారత వర్షమునకు చెందిన మహర్షుల చరిత్ర. ఇట్టి గ్రంథకర్త ఆర్షకవి శిరోమణి విద్వాన్ బులుసు వేంకటేశ్వరులు గారికి మనసా వాచా కర్మణా నేను కృతజ్ఞుడను.మహోన్నతమైన అశ్వత్థవృక్షము వంటి ఈ వేదవిశ్వ విద్యాలయమున ఒక కొమ్మగ ఎదుగుటకు గంగా స్రవంతివలె కారణభూతులైన నా శ్రేయోభి లాషులు మాన్యశ్రీ **కె.ఎస్. శ్రీనివాసరాజు**, ఐ.ఎ.ఎస్., జె.ఇ.ఓ., టి.టి.డి. గారికి నేను సర్వదా కృతజ్ఞుడను. నాకు ప్రోత్సాహకారకులైన **ఆచార్య కె.ఇ.దేవనాథన్,** ఉపకులపతి గారికి, నాటి కులసచివులు **శ్రీ జి.ఎస్.ఆర్. కృష్ణమూర్తి** గారికి అలాగే మా పరిశోధన మరియు ముద్రణ విభాగ ఉపనిర్దేశకులు **శ్రీ రాధేశ్యామ్** గారికి నేను సర్వదా కృతజ్ఞుడను.

ఈ పుస్తకమునకు మూల ప్రతులను అందించిన ప్రాచ్యలిఖిత భాండాగార పరిశోధనలో పనిచేయు **డా॥ యడవల్లి లక్ష్మీశ్రీకాంత్‌శర్మ** నా ఆశీస్సులు. ఇంత చక్కటి పొత్తమును నా సూచనల మేరకు వ్రాసిన **డా॥ అమర్‌కుమార్**, చక్కటి సంగణికమును(డి.టి.పి)గావించిన **యడవల్లి వేంకటేశ్వర శివకుమార్** మరియూ ఈ పుస్తకమును అందముగా తీర్చిదిద్దిన **కొండపి సురేష్ బాబు**లకు సప్తగిరి నాథుడు శ్రీవేంకటేశ్వరుని దివ్యాశీస్సులు. ఈ నా మొదటి ప్రయత్నముగ 'ఋషుల గాథలు' మొదటిభాగ ముద్రణకు సహకరించిన యావత్ బృంద మంతటికి నా కృతజ్ఞతాభి వందనములు.

"సర్వేజనా సుఖినో భవన్తు
సమస్త సన్మంగళాని భవన్తు"

భవదీయులు
**డా॥ విద్వాన్ అమరవాది శేషయ్య**
పరియోజన అధికారి,
పరిశోధన-ప్రకాశన విభాగము.

తిరుపతి.
12-07-2017

# సంకలన కర్త పరిచయము



| | |
|---|---|
| సంకలన కర్త | **డా॥ అమరవాది శేషయ్య** దానశీలులు, సంఘసేవకులు, మరియు ఆధ్యాత్మిక మార్గనిర్దేశకులు |
| తల్లిదండ్రులు | కీ॥శే॥ శ్రీమతి అమరవాది రాజమ్మ, శ్రీ రామకృష్ణయ్యగారలు |
| జన్మస్థలము | నెఱబైలు (పవిత్రపుణ్యక్షేత్రముమైన శ్రీతలకోన సిద్ధేశ్వరస్వామి వారి దేవాలయమునకు 9 కి॥మీ॥ సమీప గ్రామము, ఎర్రావారిపాలెం మండలము, చిత్తూరుజిల్లా, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రము) |
| విద్యార్హతలు | తెలుగు విద్వాన్, ఎమ్.ఏ.తెలుగు, ఎమ్,ఏ, సంస్కృతము, ఎమ్.ఏ. ఫిలాసఫీ, ఎమ్.ఏ. జ్యోతిష్యము, ఎమ్.ఫిల్ తెలుగు, పిహెచ్‌డి తెలుగు. సర్టిఫికెట్ ఇన్ వైష్ణవిజమ్. |
| ఉద్యోగ జీవనము | 29-07-1974 నుండి 31-05-2010 వరకు తమిళనాడు ప్రభుత్వ ఉన్నతోన్నత పాఠశాలలో తెలుగు శాఖ ఉపన్యాసకులు. ప్రస్తుత ఉద్యోగ జీవనము 21-4-2015 నుండి ఇప్పటివరకు పరియోజన అధికారి, పరిశోధన మరియు ప్రకాశన విభాగము, శ్రీ వేంకటేశ్వర వేద విశ్వవిద్యాలయము, తిరుపతి. |
| ఆధ్యాత్మిక జీవనము | 12-06-1988 నుండి ఇప్పటివరకు సహజమార్గ రాజయోగ ధ్యాన మార్గ ప్రక్రియలో బాబూజీ మెమోరియల్ ఆశ్రమము (శ్రీరామ చంద్ర మిషన్ చెన్నై)ద్వారా ధ్యానసాధన అభ్యాసి. |
| ప్రసంగములు | 1980 నుండి ఇప్పటివరకు ఆకాశవాణిలో, తెలుగు సాహిత్యములో మద్రాసు, విజయవాడ, హైదరాబాదు, తిరుపతి కేంద్రములలో ప్రసంగములు. అలాగే 1990 నుండి దూరదర్శన్ కేంద్రములలో మద్రాసు, విజయవాడ, హైదరాబాదులనందు అలాగే ఇతర ప్రవేటు చానల్స్‌లో దాదాపు 110 భాగములలో ఆధ్యాత్మిక ప్రసంగములు. |
| రచనలు | అనుబంధముగా భక్తి సాహిత్యమునకు సంబంధించిన 25 భక్తి రచనలు 'అమరవాది పబ్లికేషన్స్' ద్వారా ప్రచురించడమైనది. |
| బిరుదములు | "ప్రజ్ఞారత్న" |
| దూరవాణి | 9705830573 |
| ఇ.మెయిల్ | dramaravadi@gmail.com |
| చిరునామా | ప్లాట్ నెం. 201, 2వ ఫ్లోర్, పద్మావతి రెసిడెన్సి, కాసాని కౌసల్య కాలనీ, టర్పో మిషనరి దగ్గర, బాచుపల్లి, హైదరాబాద్. కె.వి. రంగారెడ్డి జిల్లా, తెలంగాణ రాష్ట్రం |
| ప్రస్తుతచిరునామా | 18-1-26/ F, ద్వారకానగర్, తిరుపతి-517501, ఆంధ్రప్రదేశ్. |

# విషయసూచిక

❖❖❖❖❖

# ఉపోద్ఘాతము

మన భరతవర్షము ఆర్షభారతము అనియు ఆర్యావర్తమనియు పేరు గడించుటకు కారణము పుణ్యతపోధనులైన ఋషులచరిత్రలే కారణములు. పవిత్రమైన మన భరత ఖండమున జన్మించి తమ తపో మహిమచే సృష్టిస్థితి లయకారకులైన వారే మహర్షులు. ముఖ్యముగ వీరు విశ్వసంరక్షణకై త్రిమూర్తుల కార్యములను నిర్వర్తించుటకు ప్రతినిధులై త్రిమూర్తులకు ఆర్తిసమయములలో ఉద్ధారకులై సంరక్షకులైన పరాత్పరులుగ వీరిని చెప్పవచ్చు.

'బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః' అన్నట్లుగ బ్రహ్మవిద్యావేద్యులు, పరమ పవిత్రప్రవర్తకులు, పరమేశ్వర కల్పులు అగు బ్రహ్మర్షులలో అగస్త్యమహర్షి అగ్రేసరుడు. వసిష్ఠ మహర్షికి సహజన్ముడు, త్రికాలజ్ఞాని, భక్తిజ్ఞానయోగ విరాగనిధి, గృహస్థరత్న అను ఎన్నియో విశేషణములతో కూడిన విచిత్రమైన ఈ మహాపురుషుడే ఈ అగస్త్యమహర్షి. "ఋషిమూలం నదీమూలం తెలియదు" అన్నట్లుగ మహాపురుషుల యొక్కయు మహానదుల యొక్క జన్మగాథలు చిత్రాతి చిత్రములు. అగస్త్యుని జన్మకథతో ప్రారంభించి ఋషుల గాథలు ఇంచుక పరిశీలించుదము.

# 1. అగస్త్యమహర్షి

## 1. అగస్త్యుని జన్మకథ

పూర్వకాలములో దేవేంద్రుడు దేవతలను బాధించెడి తారకాది రాక్షసులను సంహరింప అగ్నిదేవుడిని ఆజ్ఞాపించెను. వాయువు సహాయము చేత అగ్ని రాక్షసులెల్లరిని నాశనము చేయుచుండెను. ఇంతలో ఆ రాక్షసులు భయపడి సముద్రమున దాగుకొనిరి. ఆ సమయములో అగ్నిదేవుడు వీరి బాధ తొలగినది కదా అని ఉపేక్షగా యుండెను. కాని కొంతకాలము అయిన తరువాత ఈ తారకాది రాక్షసులు రాత్రిసమయము నందు వచ్చి దేవతలను మునులను మానవులను నానా విధములుగ బాధపెట్టుచూ చివరికి పగటి వేళల్లో సముద్రమున దాగుకొనుచుండెడి వారు. ఇలా పన్నెండు సంవత్సర ములు గడచినవి.

అటుపై మహేంద్రుడు కోపపడి అగ్నిదేవుని, వాయుదేవుని పిలిచి సముద్రమును ఇంకించి అందుదాగియున్న ఆ రాక్షసులను భస్మము చేయమని ఆజ్ఞాపించెను. అంత వారిరువురు "ఓ దేవేంద్రా! సముద్రమును ఎండగొట్టుట వలన అందు జీవించు అనంతమైన జీవరాశి నశించును. అది గొప్ప దోషము. కావున రాక్షస నాశనమునకు మరియొక ఉపాయ మును ఆలోచించ"మని ప్రార్థించిరి. కాని ఇంద్రుడు వారిపై కోపించి "నా ఆజ్ఞనే ధిక్కరించెదరా! దాని ఫలితమును అనుభవింపుడు. మీరు ఇరువురు భూమిపై ఒక అచేతనమైన పదార్థమునుండి మునులై జన్మించుడు" అని శపించెను.

ఇలా ఉండగ ఒకానొక సమయమున విష్ణుమూర్తి ధర్ముని సుతులగు నరనారాయణ అవతారములెత్తి గంధమాదన పర్వతమున ఉగ్రతపమును చేయుచుండెను. వారి తపస్సునకు అసూయపడి ఇంద్రుడు మన్మథ, వసంతలను వారి తపోభంగమును కావింపమని ఆజ్ఞాపించెను. అటుపై మన్మథ వసంతలు పెక్కు అప్సరసలను తీసుకెళ్ళి తమ కళా నైపుణ్యముతో వారి తపస్సును భంగముగావించిరి. ఇది ఇలా ఉండగా నారాయణుడు తన తొడనుండి ఒక జగన్మోహినిని పుట్టించెను. ఆ నారాయణుని ఊరువునుండి పుట్టుటచే ఆమెకు 'ఊర్వశి' అను పేరు వచ్చెను. ఇలా ఉండగ అటువంటి అందమైన ఊర్వశిని చూడగనే సూర్యునికి ఆమెపై కోరిక కలిగెను. తనతో సుఖింప ఆమె తన లోకమునకు రమ్మనెను. ఉర్వశి సూర్యుని కోర్కెను తీర్చపోవుచుండగ ఇంతలో వరుణదేవుడు ఆమెను చూచి మోహించి "ఓ తరుణీ! నీపైన నాకు మనస్సు కలిగినది నీవు నా లోకమునకు వచ్చి నాతో సుఖింపమని" కోరెను. కాని ఊర్వశి నిరాకరించి, "నన్నిదివరకే సూర్యదేవుడు కామించి తనలోకమునకు రమ్మని కోరెను. నేను అతని కోరికను తీర్చుటకై పోవుచుంటిని" అని చెప్పెను.

అది విని వరుణుడు "ఓ స్త్రీ ! నీ మనస్సును నాపై నిలిపి పొమ్ము అదియె నాకు పదివేలు" అనెను. అందులకు ఆమె అంగీకరించి సూర్యుని కడకేగెను. అటుపై ఆమె భావములను గ్రహించిన సూర్యుడు "ఓసి! ఒక పురుషుని మనసున తలచుచూ, ఇంకొక పురుషుని కడకు వచ్చితివా?" అని కోపించి "ఈ దోషమున నీవు భూలోకమున బుధ పుత్రుడగు పురూరవునకు భార్యగ జన్మించుము" అని శపించెను.ఇది ఇలా ఉండగా సూర్యునకు, వరుణునకు ఉర్వశిపై కలిగిన కామోపశమనము కాకుండ వారిరువురికి వీర్య పతనము కలుగు చుండెను. ఇది అంతయు మహేంద్రుడు అగ్ని, వాయువులకు ఇచ్చిన శాపముగ అగ్ని-సూర్యుని, వాయువు-వరుణుని

ప్రవేశించి ముని జన్మమును పొందుట మొదలగు విషయములు వారికి అవగతమయ్యెను. చివరికి వారిరువురు తమ వీర్యమును లోక సంరక్షణా ర్థముగ ఒక జలపూర్ణ కలశముగ విడచి యధేచ్ఛగ వెడలిపోయిరి. అందులో నుంచి ఏర్పడినవారే అగస్త్యుడు, వశిష్ఠుడు. వీరికే కలశజులుఅని, కుంభ సంభవులని, ఔర్యసేయులని,మిత్రావరుణ పుత్రులని, వహ్నిమారు తసంభవులని పేరువచ్చెను.[1]

**2. అగస్త్యుని బాల్యము**

అగస్త్యుడు శుక్లపక్ష చంద్రుని వలె దినదిన ప్రవర్ధమానమగు చుండెను. మహానిష్ఠాగరిష్ఠుడు, బ్రహ్మచారి, తపఃతేజోసంపదవిరాజి అయిన అగస్త్యునికి బాల్యముననే దేవతలు ఉపనయనాది సంస్కారములను, ప్రణవ పంచాక్షరీ మంత్రోపదేశమును కావించెను. నిరాహారుడుగను జితేంద్రియుడుగ నిష్కల్మషుడుగ దివ్యతేజస్సుతో ఉగ్రతపస్సు చేయుచున్న ఆ నిష్ఠాగరిష్ఠునికి ఒకనాడు పితృదేవతల ఆదేశము ఇలా అయ్యెను.

**3. అగస్త్యునికి పితృదేవతల ఆదేశము**

ఒకనాడు అగస్త్యుడు అరణ్యములో సంచరించుచుండగ ఒక వృక్షశాఖకు తలక్రిందులై వ్రేలాడుచున్న మునీశ్వరులు కనబడిరి. వారిని చూచి అగస్త్యుడు "మహాత్ములారా! ఇప్పుడు మీరు ఈ దురవస్థలో ఉండుటకు కారణమేమి. ఇంతకు మీరెవరో నాకు తెలుపండి" అని పలికెను.

అంత వారు "నాయనా! మేము అన్యులము కాము, పితృ దేవతలము. నీవు పుత్రపౌత్రాదులను పొందినగాని నీవిచ్చెడి పితృ తర్పణము లతో మేము ఉర్ధ్వలోకములకు పోలేము. మాకు చిరకాల వాంఛ తీర్చాలి.

1. ఈ విషయము పద్మపురాణమున సృష్టిఖండమునందు చెప్పబడెను. అలాగే భారతమున అరణ్యపర్వమునందును చెప్పబడెను.

నీకు ఇప్పుడు సమయము ఆసన్నమయినది. కాన నీవిప్పుడు బ్రహ్మచర్య ఆశ్రమమును వదలి గృహస్థాశ్రమమును స్వీకరింపుమని" పలికెను. అంత వారి మాటలను వినిన అగస్త్యుడు వినయ పూర్వకముగ "ఓ పితృదేవతలారా! మీ కోరికెను నెరవేర్చెదను. మన కులమున ఎప్పటి కైనను ఒక ఉత్తముడు జన్మించి పితృఋణము తీర్చవలెననెడి మీకోర్కెను నేను వృధాచేయను. పితృఋణమును తీర్చుకొందును. పితృదేవతల ఆశీస్సులు నాకు అవసరమని" పలికి వారి ఆశీస్సులను పొంది తన ఆశ్రమమునకు చేరెను.

### 4. అగస్త్యుని వివాహము

పితృదేవతల ఆదేశానుసారము అగస్త్యుడు తన తపఃశక్తిచేత పుత్రకాముడగు విదర్భరాజునకు ఒక అందమైన కుమార్తె కలుగునట్లు వరమిచ్చెను. ఆమె పేరు 'లోపాముద్ర'. ఆమె బహుళ సౌందర్యరాశి. ఇలా కాలము గడుచుకొద్ది ఒకనాడు పెరిగిపెద్ద అయిన కన్యక అగు లోపా ముద్రను తనకిచ్చి వివాహము చెయ్యమని విదర్భరాజును అడిగెను.

అంత విదర్భరాజు ఇటువంటి సౌందర్యవతియగు తన ముద్దుల కుమార్తెయగు లోపాముద్రను అగస్త్యునికిచ్చుటకు సందేహించుచుండగ అది గ్రహించిన లోపాముద్ర తండ్రిచెంతకుచేరి తాను ఆ మునివర్యుడను వివాహము చేసుకొనెదనని తన అంగీకారమును తెల్పెను. అంత విదర్భ రాజు తన కుమార్తె కోరిక ప్రకారము వివాహము జరిపించెను. అప్పటి నుండి ఆ ప్రదేశము 'సిద్ధ తీర్థము' అను పేర మహాతీర్థ ప్రదేశముగ ప్రసిద్ధి చెందినది.

అటుపై అగస్త్యుని వెంట లోపాముద్రయు నారచీరలను ధరించి వెంటరాగ గంగాతీర ప్రదేశమున ఒక ఆశ్రమమును నిర్మించుకొని అగస్త్యుడు గృహస్థాశ్రమ ధర్మమును నిర్వర్తించుచు తపోవృత్తితో కాలము గడుపు చుండెను. ఇలా ఉన్న ఆ ఇరు దంపతులకు పుత్రులు పొంద, పితృ

ఋణముతీర్చ, తన ధర్మమును నిర్వర్తింప దలచిన కోరికను అగస్త్యుడు లోపాముద్రతో తెలుపగ ఆమె ఈ విధముగ ఒక షరతును పెట్టెను. అది ఏమనగ తన సంగమమును అపేక్షించినచో తనకు సమస్త ఆభరణములు సున్నిత వస్త్రములును కావలెననెడి కోరికను షరతుగ పెట్టెను. అంత అగస్త్యుడు ఆ పనికై మొట్టమొదటగ 'శ్రుతర్వుడు' అను రాజు దగ్గరకు వెళ్ళి నీకు సరిపోయెడి ధనమును తీసుకొని మిగిలిన ధనమును నాకు ఇవ్వమని పలికెను. అంత సుతపర్వుడు తనదగ్గర అంత ధనము లేదనగ అటుపై ఇరువురు కలిసి 'ప్రధ్నశ్వుడు' వద్దకు వెళ్ళిరి. అతని వద్ద అతనికి సరిపడని ధనము ఉండుటచే ముగ్గురు కలిసి 'త్రసదస్యుడు' అను రాజువద్దకు వెళ్ళిరి. అతని దగ్గరను ధనము సరిపడక నలుగురు కలిసి 'ఇల్వలుడు' అను రాక్షసుని దగ్గరకు వెళ్ళిరి.

### 5. వాతాపి-ఇల్వల మర్థనము

ఇల్వలుడను రాక్షసుడు 'మణిమతిపుర' అధిపతి. అతని తమ్ముడే వాతాపి. వాడు కామరూపి. ఒకానొకనాడు ఇల్వలుడు ఒక ఉత్తమ బ్రాహ్మణుని తనకు సకల కామ సిద్ధికరములు అగు ఒక మంత్రమును ఉపదేశింపమని కోరి విఫలుడయ్యెను. కాని తన తమ్ముడగు వాతాపిని మేకను చేసి మధించి ఆ మాంసమును ఆ బ్రాహ్మణునకు భోజనముగ పెట్టి భోజనానంతరము తన తమ్ముడిని పిలివగ వాతాపి ఆ బ్రాహ్మణుని కడుపును చీల్చుకొని బయటకు వచ్చెను. పాపం ఆ అమాయక బ్రాహ్మణుడు వెంటనే మరణించెను. ఇల్వలుడు ఇదే ప్రకారముగ అలవాటు చేసుకొని చాలామంది బ్రాహ్మణులను చంపివేసెను.

ఇలా ఉన్న తరుణంలో ఇల్వలుని ఇంటికి వచ్చిన అగస్త్యునికి ఈ స్థితి తప్పలేదు. ఇల్వలుడు వాతాపిని మేకనుచేసి చంపి ఆ మాంసమును అగస్త్యునకు పెట్టించెను. ఈ విషయమును ముందే గ్రహించిన తక్కిన

ముగ్గురు రాజులు అగస్త్యుని ఎంత వారించినను వినక ఆ మాంసమును భుజించెను. ఎప్పటిలాగే ఇల్వలుడు తమ్ముని పిలువగ అది గుర్తించి అగస్త్యుడు "జీర్ణంజీర్ణం వాతాపిజీర్ణం" అని కడుపు తడుముకొనుచు ఒక త్రేన్పు త్రేన్పెను. అంత వాతాపి జీర్ణమయిపోయెను. అంత ఇల్వలుడు చేయునది లేక అగస్త్యుని శరణుజొచ్చి అతనికి కావలసిన ధనము బంగారము గుఱ్ఱములతో గలిగిన బంగారపు రథమును, పాడి ఆవులు మొదలగునవి ఎన్నియో వెంటనే అగస్త్యుని ఆశ్రమమునకు చేరునట్లు చేసెను. ఇలా ఇల్వలుని అహంకారమును అణచిన అగస్త్యునకు లోకంలో 'వాతాపీల్వల మర్దనుడు' అను నామము ఏర్పడెను. అటుపై అగస్త్యుడు భార్యయైన లోపాముద్రకు సమస్త ఆభరణములను అనేక అందమైన వస్త్రములను ఏర్పాటుచేసి "నీ కోరికను తీర్చితిని నీకిప్పుడు ఎంతమంది కుమారులు కావలెనో చెప్ప మనగ" ఆమె "నాకు ఒక్క కుమారుడే చాలును అనేకమంది అవసరము లేదు" అని అనెను. అప్పుడు అగస్త్యుడు ఆమె కోరికను అనుగ్రహించి తాను తపోవ్రతుడయ్యెను.

అటుపై లోపాముద్ర గర్భవతియై ఒకానొక శుభముహూర్తమున 'దృఢస్యుడు' అను కుమారుని ప్రసవించెను. అటుపై కొన్నాళ్ళకు దృఢస్యుడు పెరిగి పెద్దవాడయిన తరువాత అతనికి 'తేజస్వి' అను కుమారుడు పుట్టెను. ఈ ప్రకారముగ అగస్త్యుడు పుత్రపౌత్రులతో సంతసుడై ఒకప్పుడు పితృదేవతలు కోరినకోర్కెలను నెరవేర్చినవాడై వారికి పుణ్య లోకములను కల్పించెను.[1]

### 6. అగస్త్యుడు కవేరకన్యను వివాహమాడుట

పూర్వము బ్రహ్మదేవుడు అగస్త్యుని ఆశ్రమమునకు వచ్చెను. అగస్త్యుడు అతనికి మిగుల ఆనందముతో అర్ఘ్యపాద్యాదులను కావించి

1. ఈ ఇతి వృత్తము భారతమున అరణ్యపర్వమున కలదు.

ఇట్లనెను. "ఓ చతురానన! ఎంతో గొప్ప తపస్సుయొక్క ప్రభావముచేత అయినగాని నిన్ను దర్శనము చేసుకొనుట కష్టము. కాని నీవు అనుకోని విధముగ మా ఇంటికి రావటం మా అదృష్టం. మహాత్ములు ఊరకనేరారు, మీ ఆజ్ఞను తెలుపుడు. శిరసా వహించెదను" అని పలికెను.

అంత బ్రహ్మ "ఓ తపోనిధి! నీ వంటి ఉత్తమమహర్షుల మూలము గనే లోకమున కొన్ని మంచిపనులు జరుగును. పూర్వము ఒకనాడు 'కవేరుడ'ను రాజర్షి ఈశ్వరుని గూర్చి తపస్సు చేసెను. ఈశ్వరుడు ప్రత్యక్షమై నీ కోరిక ఏమని అడుగగ నాకు ముక్తిని ప్రసాదించమని వేడుకొనెను. అంత ఈశ్వరుడు ఈ పని బ్రహ్మ వలన సిద్ధించును. అతనిని గూర్చి తపస్సు చేయమని చెప్పెను. అంత నన్ను గూర్చి ఘోరతపస్సు చేయగ నేను ప్రత్యక్షమై నా కుమార్తె యగు 'విష్ణుమాయ' అతనికి కూతురిగ జన్మించునని చెప్పితిని. అతనికి ముక్తిని సిద్ధింప "నీ పుత్రికగ విష్ణుమాయ జన్మించిన తదుపరి నీ కోరిక నెరవేరును" అని చెప్పితిని.

"కావున నాడు విష్ణుమాయగ జన్మించిన నా కుమార్తె తండ్రి యగు కవేరునకు ముక్తినొసగుట కొరకు గొప్పతపస్సు చేయుచుండెను. ఆమె యొక్క అంశమే నీ భార్యఅగు లోపాముద్రగ పూర్వము నేను సృష్టించి తిని. లోపాముద్రను నీవు వివాహమాడితివి. అలాగే ఈ కవేర కన్యను కూడ నీవు వివాహమాడవలెను. దీని వలన నీకును ఆమెకును శ్రేయస్సు కలుగును" అని వేడుకొనెను. అటుపై బ్రహ్మమాటలను ఆలకించిన అగస్త్యుడు ఆమెను వివాహమాడకోరి కవేరకన్య అన్వేషణమునకై బయలు దేరెను. ఇలా అరుదెంచిన అగస్త్యునికి కవేరకన్య దివ్యసుందర రూపముతో అగుపించి ఆనందముతో అగస్త్యుని పాదములపై పడి అతనిని పూజించెను. "ఓ మహాత్మ! త్రిలోకపూజ్యులగు తమ దివ్యదర్శనముచేత నేను పవిత్రు రాలను అయితిని. నన్ను కరుణించి నా ఆతిధ్యమును స్వీకరించి నన్ను

కృతార్థురాలును చెయ్యమని" ప్రార్థించెను. అంత ఆ మాటలను విని సంతసించిన అగస్త్యుడు నీ కార్యార్థమై వలచి వచ్చియున్నాను, నన్ను వివాహమాడుము అని పలికెను. అటుపై కవేరకన్య "ఓ తేజోనిధి! నాకు అంతటి భాగ్యమే కలిగిన కావలసినది ఏమున్నది. అయినను మీరును లోపాముద్ర అన్యోన్య దంపతులు గదా! ఇక నాకు మీవద్ద స్థానము ఎట్లుండును. అయినను అనతి కాలములోనే నదిగా మారిపోవుచున్నాను. నా వలన మీకు ఎట్లు సుఖము కల్గునని" తన సందేహమును వెలిబుచ్చెను.

అంత అగస్త్యుడు "ఓ కాంతామణి! లోపాముద్రయు నీ అంశము ననే జన్మించినది. దానికి నీవు సందేహింపనక్కరలేదు. ఇక నీవు నదివైనను నీ పతివ్రతము నాకు ఇష్టమే" అని పలికెను. కవేరి తనయ కూడ అంగీకరించి అగస్త్యుని వివాహము చేసుకొని నదిగా మారిపోయెను. అటుపై అగస్త్యుడు ఆమెను తన కమండలమున ఉంచుకొనెను. ఈ కవేరితనయే కొంతకాలము తరువాత వింధ్యపర్వత గర్వమును అణచు నిమిత్తమై అగస్త్యుడు పోవుచూ తన కమండలమును శిష్యులచేకొని తెమ్మని చెప్పిపోగా సహ్యపర్వత సమీపమున అగస్త్యుడు లేకుండట చూచి తన కార్యము జ్ఞప్తికి రాగ ఆమె నదియై నేలపైపడి ప్రవహించెను. ఈ నదియే 'కావేరి' నదిగ ప్రసిద్ధికెక్కెను. ఆ నదియందు స్నానము చేయుటతోడనే తండ్రియగు కవేరరాజర్షి సద్యోముక్తుడయ్యెను.[1]

అందుకే తీర్థస్నానములో ముక్తిప్రదాయకముగ మనము అను నిత్యము ఇంటిలో స్నానము చేయుచున్నను ఈ క్రింది నదులలో స్నానము చేయుచున్నట్లుగ స్మరింపవలెనని పెద్దలు చెప్పెదరు.

"గంగే చ యమునే చైవ గోదావరి సరస్వతీ!
నర్మదా సింధు కావేరీ జలేస్మిన్ సన్నిధిం కురు॥ "

1. ఈ ఇతివృత్తము స్కంధపురాణమున 'తులాకావేరిమహాత్మ్యమున' కలదు.

## 7. అగస్త్యుడు సముద్ర ఉదకమును ఆపోసించుట

కృతయుగమున ఒకానొకప్పుడు 'వృత్రుడు' అను రాక్షసుడు కాలకేయాదులలో కలిసి ఇంద్రుని జయించి దేవతలను బాధించు చుండెను. అతని బాధను తట్టుకొనలేక వారందరు కలిసి బ్రహ్మదగ్గరకు వెళ్ళి మొరపెట్టుకొనెను. బ్రహ్మ వారితో దధీచి దగ్గరకు వెళ్ళి అతని అస్థులు (ఎముకలను) తీసుకొని ఇంద్రునికిచ్చినచో ఇంద్రుడు అ అస్తులను ఆయుధముగ చేసి వృత్రాసురుడిని జయించునని చెప్పెను. అంత దేవత లందరు సరస్వతీ తీరమునగల దధీచిని ప్రార్థించగ దధీచి దేవతల మేలు కొరకై తన ప్రాణములను వదలెను. అంత అతని అస్తులను ఆయుధముగ చేసి త్వష్ట (బ్రహ్మ) ఇచ్చిన వజ్రాయుధముచే ఇంద్రుడు వృత్రాసురిని చంపెను.

ఇది ఇలా ఉండగ వృత్రాసురుడు చనిపోగ మిగిలిన కాలకేయాది రాక్షసులు ధర్మచరితులైన ఋషులను చంప ప్రయత్నించిరి. వారు పగలంతయు సముద్రమున దాగుకొని రాత్రి సమయమున బ్రాహ్మణులను చంపుచుండిరి. వారు వరుసగ వశిష్ఠుని ఆశ్రమమున 197 మందిని, చ్యవనుని ఆశ్రమమున 100 మందిని, భరద్వాజ మహర్షి ఆశ్రమమున 20 మంది బ్రహ్మర్షులను చంపి భక్షించిరి.

ఇలా దౌష్ట్యమునకు ఒడిగట్టిన కాలకేయాది రాక్షసులను ఎలా సంహరించవలయునో దిక్కుతోచక అష్టదిక్పాలకులైన ఇంద్ర, యమ, అగ్ని, వరుణ, కుబేరాదులెల్లరును విష్ణుమూర్తివద్దకు వెళ్ళి మొర పెట్టుకొనిరి. అంత విష్ణువు ఈ కార్యమును చేయ సమర్థుడు అగస్త్య మహర్షి ఒక్కడేనని అతడు ఆ సముద్రజలమును పానము చేయగలడని, అటుపై ఈ కాల కేయాది రాక్షసులను చంపుడని చెప్పి పంపివేసెను. అంత అష్టదిక్పాలకాది దేవతలు మహావిష్ణువుయొక్క ఆజ్ఞను శిరసా వహించి అగస్త్యుని చెంతకుచేరి

తమకోరికను వెళ్ళబుచ్చిరి. అంత అగస్త్యుడు వారి కోరికను మన్నించి ఒక్కసారిగ సముద్రమును ఆపోసించగా దేవయక్షగణములు అభినందించెను. సముద్రమునుండి బయటపడిన కాలకేయాది రాక్షసులను సంహరించిన పిదప అగస్త్యుని దేవతలందరు కలసి 'పీతసముద్రుడు' అని కీర్తించిరి. అటుపై దేవతలు అగస్త్యుని తిరిగి ప్రార్థించిరి. "ఓ మహర్షి! ఈ సముద్ర జలము జంతువు లకు ఆశ్రయమైనది. ఇది ఎండిపోరాదు. కావున ఈ సముద్ర జలమును పూరింపుడు" అని వేడుకొనిరి. అంత అగస్త్యుడు "ఓ దేవతలారా! ఈ సముద్రజలమంతయు ఇదివరకే జీర్ణమయిపోయెను. నేనిప్పుడు మూత్రద్వారమునుండి పూరింపగలను" అని చెప్పి అట్లే చేసెను. ఈ కారణము వలననే సముద్రజలము ఉప్పుగా మారెను. కావున పర్వ దినముల తప్ప ఈ నీరు స్నానాదులకు అర్హముకాదు.[1]

## 8. అగస్త్యుడు శ్రీరామునకు ఆదిత్యహృదయమును ఉపదేశించుట

అగస్త్యుడు అటుపై ఘోరమైన తపస్సుచేయ దండకారణ్య మధ్య ప్రదేశమున ఒక ఆశ్రమమును నిర్మించుకొని యుండెను. ఆ సమయమున శ్రీరామచంద్రుడు అరణ్యవాసము చేయుచూ శరభంగుడు, మందకర్ణి మొదలగు మహర్షులను దర్శించి సీతాలక్ష్మణ సమేతుడై వారిచే పూజింప బడి సుతీక్ష్ణమునీశ్వరుని ఆశ్రమమునకు వచ్చెను. దీనినిబట్టి మనకు శ్రీరామచంద్రుడు అరణ్యవాస సమయమున అనేకమంది ఋషుల ఆశీర్వాదమున ఋష్యాశ్రమములందు సంచరించెనని చెప్పవచ్చును. శ్రీరాముడు శరభంగుడు, మందకర్ణి, సుతీక్ష్ణ మునీశ్వరులను దర్శించి అటుపై అగస్త్యుని ఆశ్రమమునకు సతీసోదరులతో వచ్చెను. అంత అగస్త్యుడు మిక్కిలి సంతోషించి శ్రీరామ లక్ష్మణులను కౌగిట చేర్చుకొని తలనిమిరి

---

1. ఈ ఇతివృత్తము స్కాందపురాణమున, మహాభారతమున అరణ్యపర్వమున కథగా చెప్పెదరు.

మూర్ధమును ఆఘ్రాణించి (వారి తలకు తన ముఖముతో కౌగలించు కొనుట) ఆశీర్వదించెను. తన ఎదుట నున్న సీతా మహాసాధ్విని ఆశీర్వదించి వారికి అతిథి సత్కారములను చేసెను.

వానప్రస్థాశ్రమము చేరిన అగస్త్యుడు దానికి తగినట్లు శ్రీరామాదు లను పూజించి శ్రీరామునకు దివ్యమైన ఖడ్గములజంట, వైష్ణవమైన విల్లు, అమోఘ బాణములు, అక్షయమైన అమ్ములపొదలను ఇచ్చి సత్కరించి అటుపై గౌతమ తీరమున గల (గోదావరి తీరము) 'పంచవటి' యందు ఆశ్రమమును నిర్మించుకొని ఉండుట మంచిదని సూచించెను. అంత అతని ఆశీస్సులను పొందిన సీతాలక్ష్మణ సహితుడగు శ్రీరాముడు అతనిని వందనముతో స్తుతించి ముందుకు సాగెను.

అటుపై కొంతకాలమునకు శ్రీరామరావణుల యుద్ధ సమయము లో రావణునియొక్క తీవ్రమైన బాణయుద్ధమున దిక్కుతోచని సమయము లో అగస్త్యుడు శ్రీరాముడు విష్ణుమూర్తియని జ్ఞప్తికి తెచ్చుకొని అతనికి సూర్యుడు కులదైవము కాన కులదైవమును స్తుతించినచో శత్రుసంహారము సులభ మగునని గుర్తించి యుద్ధకాండమున అగస్త్యుడు శ్రీరామునకు ఇలా 'ఆదిత్య హృదయము'ను ఉపదేశించెను.

1. తతో యుద్ధపరిశ్రాంతం సమరే చింతయా స్థితమ్
   రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్
2. దైవతైశ్చ సమాగమ్య ద్రష్టుమభ్యాగతో రణమ్
   ఉపాగమ్యాబ్రవీద్రామమగస్త్యో భగవాన్ ఋషిః
3. రామ!రామ! మహాబాహో!శృణు గుహ్యం సనాతనమ్
   ఏన సర్వానరీన్ వత్య! సమరే విజయిష్యసి
4. ఆదిత్య హృదయం పుణ్య సర్వశత్రువినాశనమ్
   జయావహం జపేన్నిత్యం అక్షయం పరమం శుభమ్

5. సర్వమంగళమాంగల్యం సర్వపాపప్రణాశనమ్
చింతాశోకప్రశమనమాయుర్వర్ధనముత్తమమ్

6. రశ్మిమంతం సముద్యంతం దేవాసుర నమస్కృతమ్
పూజయస్వ వివస్వంతం భాస్కరం భువనేశ్వరమ్

7. సర్వదేవాత్మకో హ్యేష తేజస్వీ రశ్మిభావనః
ఏష దేవాసుర గణాన్ లోకాన్ పాతి గభస్తిభిః

8. ఏష బ్రహ్మాచ విష్ణుశ్చ శివస్స్కందః ప్రజాపతిః
మహేంద్రో ధనదః కాలో యమస్సోమో హ్యపాం పతిః

9. పితరో పవనస్సాధ్యా హ్యశ్వినౌ మరుతో మనుః
వాయుర్వహ్నిః ప్రజాః ప్రాణ ఋతుకర్తా ప్రభాకరః

10. ఆదిత్యస్సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్
సువర్ణ సదృశో భానుః హిరణ్యరేతా దివాకరః

11. హరిదశ్వస్సహస్రార్చిః సప్తసప్తిర్మరీచిమాన్
తిమిరోన్మథనశ్శంభుః త్వష్టా మార్తాండ అంశుమాన్

12. హిరణ్యగర్భశ్శిశిరః తపనో భాస్కరోరవిః
అగ్నిగర్భోఽదితే పుత్రః శంఖః శిశిరనాశనః

13. వ్యోమానాథస్తమోభేదీ ఋగ్యజుస్సామపారగః
ఘనవృష్టి రపాం మిత్రో వింధ్యవీథీప్లవంగమః

14. ఆతపీ మండలీ మృత్యుః పింగళస్సర్వతాపనః
కవిర్విశ్వో మహాతేజా రక్తస్సర్వభవోద్భవః

15. నక్షత్ర గ్రహతారాణామధిపో విశ్వభావనః
తేజసామపి తేజస్వీ ద్వాదశాత్మన్నమోఽస్తుతే

16. నమః పూర్వాయ గిరయే పశ్చిమే గిరయే నమః
జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః

17. జయాయ జయ భద్రాయ హర్యశ్వాయ నమో నమః
నమోనమస్సహస్రాంశో ఆదిత్యాయ నమో నమః

18. నమ ఉగ్రాయ వీరాయ సారంగాయ నమో నమః
నమః పద్మప్రబోధాయ మార్తాండాయ నమో నమః

19. బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్య వర్చసే
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషేనమః

20. తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామితాత్మనే
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాంపతయే నమః

21. తప్తచామీకరాభాయ వహ్నయే విశ్వకర్మణే
నమః తమోऽభినిఘ్నాయ రుచయే లేకసాక్షిణే

22. నాశయత్యేష వై భూతం తదేవ సృజతి ప్రభుః
పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః

23. ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః
ఏష చైవాగ్ని హెూత్రం చ ఫలం చైవాగ్ని హెూత్రిణామ్

24. వేదాశ్చ క్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవ చ
యానికృత్యాని లోకేషు సర్వఏష రవిఃప్రభుః

25. ఏనమాపత్సు కృచ్ఛ్రేషు కాంతారేషు భయేషు చ
కీర్తయన్ పురుషః కశ్చిన్నావసీదతి రాఘవ!

26. పూజయ స్వైనమేకాగ్రో దేవదేవం జగత్పతిమ్
ఏతత్త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యసి

27. అస్మిన్ క్షణే మహాబాహెూ! రావణం త్వం వధిష్యసి
ఏవముక్త్వా తదాऽ గస్త్యో జగామ చ యథాగతమ్

28. ఏతచ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకోऽభవత్తదా
ధారయామాస సుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్

29. ఆదిత్యం ప్రేక్ష్యజప్త్వా తు పరం హర్షమవాప్తవాన్
త్రిరాచమ్య శుచిర్భూత్వా ధనురాదాయ వీర్యవాన్

30. రావణం ప్రేక్ష్య హృష్టాత్మా యుద్ధాయ సముపాగమత్
సర్వయత్నేన మహతా వధే తస్య ధృతోఽభవత్

31. అథ రవిరవదన్ నిరీక్ష్య రామం
ముదితమనాః పరమం ప్రహృష్యమాణః

32. నిశిచరపతిసంక్షయం విదిత్వా
సురగణమధ్యగతో వచస్త్వరేతి.

పై విధముగ ఆదిత్యహృదయ స్తోత్రపారాయణము చేసిన పిమ్మట శ్రీరాముడు కులదేవుని ఆశీస్సులచే విజయమును పొందెను. అటుపై అయోధ్యానగరమున అతనికి పట్టాభిషేకము జరిగెను. ఆ సమయమున కణ్వాది మహర్షులతో అగస్త్యమహర్షియు శ్రీరాముని చూడ అయోధ్యకు అరుదెంచి అతనిని ప్రస్తుతించిరి. శ్రీరాముడు రావణాదుల జనన విజయాది వృత్తాంతములను అడుగగ శ్రీరామునికి అగస్త్యుడు ఆ వృత్తాంతమును వినిపించెను. మరియొకసారి సీతాదేవి వాల్మీకి ఆశ్రమమున కుశలవులను ప్రసవించిన పిమ్మట పుష్పక విమానములో పోవుచూ శ్రీరాముడు అగస్త్యుని ఆశ్రమమునకు పోయెను.

అప్పుడు అగస్త్యుడు తాను చేయుచున్న యాగమును పూర్తిచేసి శ్రీరాముని పూజించి ఒక విచిత్ర రత్నమయ నవ్యవిభూషణమును ఇచ్చెను. అంత శ్రీరాముడు అది అగస్త్యునికి ఎట్లు వచ్చెనో దానిని తాను గ్రహింప వచ్చునో లేదో అను అనుమానమును అగస్త్యునిచే నివృత్తిచేసుకొనెను.

''పూర్వము శ్వేతుడను రాజర్షి తనకు ఆ ఆభరణమును ఇచ్చెననియు రాజులకు ఎవ్వరు ఏమిచ్చినను తీసుకొనవచ్చుననియు'' అగస్త్యుడు పలికి శ్రీరామునికి ఆ ఆభరణమును ఇచ్చెను. అటుపై

అగస్త్యుడు శ్రీరామునికి 'దండకారణ్య వృత్తాంతమును' తెలుపగ శ్రీరాముడు విని సంతసించి అగస్త్యుని కీర్తించి తాను అయోధ్యకు బయలుదేరెను. ఈ ఇతివృత్తము రామాయణమునందున్నట్లుగ మనకు తెలియుచున్నది.

**9. అగస్త్యమహర్షి నహుషుని శపించుట**

పూర్వము నహుషుడు అను రాజు బ్రహ్మవిదుడై నూరు యజ్ఞములను చేసి ఉత్తమములైన కుమారులను పొంది దేవత్వముతో ఉండెను. ఇంద్రుడు విశ్వరూపుని చంపిన పాపమునకు భయపడి ఇంద్ర పదవిని వదలి పారిపోయెను. అంత నహుషుడు దేవతల అభిమానమును పొంది ఇంద్రపదవిని అధిష్టించెను. కాలక్రమమున ఐశ్వర్యగర్వముతో భోగలాలసుడై ఇంద్రుని పత్ని అయిన శచీదేవితోడి పొత్తును కోరుకొనెను. అంత ఉత్తమ పతివ్రత అయిన శచీదేవి ఒక ఉపాయమును ఆలోచించి 'ముని వాహనుడై తన వద్దకు వచ్చినచో అతని కోరికను నెరవేర్చెదనని' కబురు పంపెను.

అంత నహుషుడు వివేకహీనుడై సహస్రోత్తమ బ్రాహ్మణ ధృతమైన బ్రహ్మరథమును ఎక్కి బ్రాహ్మణులను అవమానపరచి ప్రసంగవశమున 'వేదములలోని బ్రాహ్మణములైన మంత్రములు గోసంప్రోక్షణమందు చెప్పబడినవి తనకు ప్రమాణములు కావని' ఋషులతో వాదించెను. ఆ సమయమున అచ్చటనే ఉన్న అగస్త్యమహర్షి నహుషుని వారించుచూ "పూర్వాచార్యుల మంత్రములను నిందించుట అజ్ఞానమని" తెలిపెను. అంత కోపించిన నహుషుడు అతని తలపై తన్నెను. వెంటనే అగస్త్యుడు అతనికి "భయంకరమైన సర్పముగ అగుమని" శపించెను. వెంటనే నహుషుడు బ్రహ్మరథమును వదలి క్రూరమైన సర్పముగ మారి అగస్త్యుని పాదములపై పడి క్షమించమని వేడుకొనెను. అటుపై తనకు శాప విమోచనముతో పాటు పూర్వజన్మ జ్ఞాపకము చెడకుండగను, బలవంతమగు జంతువులు తనను తాకినచో బలహీనములగునట్లు ఉపాయమును

చెప్పమని ప్రార్థింపగ శాంతించినవాడై అగస్త్యుడు అతనికి కోరిన వరములు ఒసగెను. కావున పైన ఇతివృత్తమున అగస్త్యమహర్షి యొక్క శక్తి సంపన్నత ఎట్టిదో మనకు తెలియగలదు.

## 10. అగస్త్యమహర్షి ద్వాదశవార్షిక యజ్ఞము

పూర్వము ఒకానొకప్పుడు అగస్త్యమహర్షి పన్నెండు సంవత్సరముల పర్యంతము ఒక యజ్ఞముచేయ ప్రారంభించెను. ఆ యజ్ఞమునకు దివ్యానుభవముగల గొప్పవారైన మునులు ఋత్విజులై తమ ప్రౌఢత్వముతో అఖిల తంత్రములను జరుపుచుండిరి. కాని ఏదో కారణమున ఇంద్రుడు మేఘుని వర్షింప ఆజ్ఞ ఇవ్వని కారణమున ఓషధులు ఎండిపోయెను. ఆ సమయమున మునులు అగస్త్యుని చెంతచేరి అన్నదాన విధి ఏవిధముగ నెరవేరునో అని భయమును వెలిబుచ్చిరి.ఆ సమయమున అగస్త్య మహర్షి అది గుర్తించి తానే ఇంద్రపదవిని వహించి జగమును కాపాడెదనని పట్టు బట్టెను. వెంటనే ఈ విషయము ఇంద్రునకు తెలిసి కుంభవృష్టి కురిపింప మేఘునికి ఆజ్ఞనిచ్చి, బృహస్పతి వెంటనిడుకొని అగస్త్యుని దగ్గరకు అరుదెంచి శరణువేడెను. అంత అగస్త్యుడును శాంతించి వారికి గౌరవ పురస్కారములను అందించి సాగనంపెను. అటుపై యజ్ఞము పరిసమాప్త మయ్యెను[1]. అగస్త్యుడు ఆ యజ్ఞకార్యము కావించిన ఋత్విజులకు గౌరవ పురస్కారములు గావించి సంతసించెను.అటుపై అగస్త్యుడు తారక బ్రహ్మ ఉపదేశము పొందుటకై అవిముక్త క్షేత్రము నకు వెళ్ళి అచ్చట విశ్వేశ్వరుని సేవించుచుండెను.

## 11. దేవతలు అగస్త్యునికై వెదకుట

ఒకానొకప్పుడు వింధ్యపర్వతమునకు, మేరుపర్వతముపై అసూయ ద్వేషములు కలిగి సూర్యుడు తనచుట్టూ తిరుగక మేరు పర్వతము చుట్టూ

1. ఈ ఇతివృత్తము భారత అరణ్యపర్వమున కలదు.

తిరుగునను కోపముచేత పెరిగి పెద్దయై సూర్యచంద్ర నక్షత్రము లకు అవరోధము కల్పించి పగలురాత్రులకు లోకమున ఇబ్బంది కలిగించెను. ఈ విషయమును గుర్తించిన దేవతలు వింధ్యపర్వతమును ఎంత ప్రార్థించి నను వింధ్యపర్వతము వారి ప్రార్థనను మన్నించలేదు. చివరకు బ్రహ్మవద్దకు వెళ్ళి మొరపెట్టుకొనెను. బ్రహ్మకూడ ఆ పని తనవల్ల కాదని "దీనికి ఒకటే మార్గము 'అవిముక్త క్షేత్రమున' తపస్సు చేసుకొనుచున్న అగస్త్యమహాముని ఒక్కడే సమర్థుడు. మీరు వెళ్ళి అతనిని ప్రార్థించుడని" చెప్పెను. అంత దేవతలు బ్రహ్మ చెప్పిన విధముగ భూలోకమునకు బయలుదేరి కాశీ పట్టణమునకు చేరి అగస్త్యమహర్షి ఆశ్రమమును గుర్తించి అచ్చటకు వెళ్ళిరి.

## 12. అగస్త్య మహర్షిఆశ్రమ వర్ణనము

ఆగస్త్యమహర్షి ఆశ్రమము పుణ్య ఆశ్రమముగ ఎన్నో మహిమలను పొంది ప్రకాశించుచుండెను. ఇచట కొన్ని ఆశ్చర్యకరమగు విషయము లను మనము చూడవచ్చును. ఏనుగు తొండమెత్తి సింహము పిల్లలను లాలించును, తన వాడి గోళ్ళతో పులి లేడిపిల్ల ముఖమెత్తి ముద్దాడును, తోడేలు చిరుబోతులను బిగికౌగిట చేర్చి ప్రేమచూపును. చెట్టుతొర్రలలో ముంగిసతో అడవిపిల్లి చెలగాట మాడును. మధ్యాహ్న సమయములో ముంగిసకి త్రాచుపాము పడగ విప్పి గొడుగుగా పట్టును. కొండగొఱ్ఱెలు కోతులతో పొత్తుకలిగిఉండును. పై విషయములను మనము ఆలోచించి నచో పుణ్యాశ్రమమైన అగస్త్యమహర్షిఆశ్రమమున ఒకరికొకరికి విరోధ భావము లేక ప్రేమవాత్సల్యము అభిమానములతో కలిసి మెలసి ఉండుటయే గొప్పతనముగ చిత్రీకరించవచ్చును.

## 13. దేవతలు అగస్త్యుని కొలచుట

దేవతలు కాశీనగరమునకు క్రోశదూరమునగల గంగా తీరమున వెలసిన అగస్త్యుని పర్ణశాలకు చేరి లోపాముద్రతో కూడిన అగస్త్యుని చూచిరి.

ఆ సమయమున అగస్త్యమహర్షి కాశీవిశ్వేశుని ధ్యానిస్తూ, ధ్యాన ముద్రతో పలుమార్లు ఈశ్వరస్తుతిచేస్తూ, భక్తి పరవసుడై మునిగి యుండెను. అటుపై దేవతలు అతని ధ్యానము ముగిసిన పిమ్మట అతనిని చేరి మ్రొక్కగ అగస్త్యుడు వారికి అతిథి సత్కారములు గావించి సుఖాసీను లైన పిమ్మట వచ్చిన పనిని గూర్చి అడిగెను.

### 14. బృహస్పతి అగస్త్యునితో వచ్చిన విషయమునుగూర్చి తెలుపుట

అంత బృహస్పతి అగస్త్యునికి నమస్కరించి, స్తుతించి సాధ్వియగు లోపాముద్రను ప్రస్తుతించి వారిరువురి అన్యోన్య దాంపత్యమునుగూర్చి ఇలా పలికెను. "మునిచంద్రా ! నీవు ప్రణవమవు. ఈమె వేదవిద్య. నీవు తపస్సువు. ఈ సాధ్వి శాంతి. నీవు ఫలము. ఈమె సత్క్రియ. నీవు సూర్యుడవు. ఈమె చైతన్యలక్ష్మి. నీ యందు బ్రహ్మతేజము, ఈమెయందు పతివ్రతా తేజములు ప్రజ్వరిల్లు చున్నవి. ఈ ఉభయ తేజః పుంజము మాకు క్షేమమొసంగును" అని చెప్పుతూ వింధ్యపర్వత వృత్తాంతము, సూర్య చంద్రాదుల గమనము ఆగిపోవుట, దానివలన లోకమునకు కలిగిన మహా ఆపద మొదలగు విషయములను చెప్పుచూ తనతో వచ్చిన దేవతాదుల పరిచయమును చేసి "వింధ్య పర్వతము గర్వమును అణచి అందరికి మేలు చేయుడు" అని బృహస్పతి ప్రార్థించెను. అంత బృహస్పతి మాటలు విన్న అగస్త్యుడు "దేవకార్యసిద్ధి కొరకు ప్రయత్నము చేసెదను. మనకు కాశీవిశ్వేశ్వరుడే తోడు భయములేదు మీరు వెళ్ళిరండి" అని వారికి అభయము ఇచ్చెను. అగస్త్యుని మాటలు విని సంతసించిన బృహస్పతి మొదలైనవారు వారివారి ప్రదేశములకు వెళ్ళిరి.

### 15. వింధ్య గర్వాపహరణము

అగస్త్యుడు దేవతల పని నిమిత్తము పుణ్యరాశియగు కాశీని వదిలి పెట్టుచున్నందుకు అనేక విధముల పరితపించి లోపాముద్రతో కూడి

అందరిదేవతలవద్ద శెలవు తీసుకొని కాశీనుండి బయలుదేరెను. అటుపై కొన్ని విషయములను లోకయధార్థసత్యములను లోపాముద్రకు ఇలా తెలియజేసెను.

"ఓ సాధ్వీ! సుఖదుఃఖములు కారణము లేక మానవులకు కలుగవు. ఇటువంటి సుఖకరమైన కాశీక్షేత్రమును వదలెడి దుఃఖప్రాప్తికి మనము ఏమి చేసితిమి. కొన్ని యధార్థ సత్యములు లోక సమ్మతములు. కాశ్మీరమునందు కుంకుమ అనునది దేశాపేక్ష. పగలు పద్మము, రాత్రి కలువపువ్వు వికసించుట కాలాపేక్ష. పుణ్యాత్మునకు సుఖము పాపాత్మునకు దుఃఖము అదృష్టాపేక్ష. సర్వము ఈశ్వర ఆయత్తము అనునది ఈశ్వరాపేక్ష. ఏది ఏమైనను ఈశ్వర ప్రేరణమున కర్మయే సుఖదుఃఖములను కూర్చునని నా అభిప్రాయము. కావున ఈశ్వరుడు ఎవరిని రక్షింపదలచునో వానిచే పుణ్యకర్మలను చేయించును. ఎవరిని చెదిరింపదలచునో వానిచే పాప కర్మలను చేయించును. ఈ కర్మలకు కారణము అనునది అవిద్యతో కూడిన రాగద్వేషాది క్లేశ పంచకము. ఈ కర్మఫలము ఇహపరలోకముల ప్రాణులు అనుభవించును. కర్మకు హేతువైన క్లేశపంచకము ఉన్నంత కాలము సుఖదుఃఖభోగము పునర్జన్మహేతు కారణము. ఇవి తప్పవు" అని తన మనోభావములను లోపాముద్రకు తెలియజేసి మనస్సున దుఃఖించి తాను వచ్చిన కార్యనిమిత్తమై ప్రయాణమును కొనసాగించి వింధ్య పర్వత ప్రాంతమును సమీపించెను.

అగస్త్యమహర్షిని దూరమునుండి చూసిన వింధ్యపర్వతము అణిగి మణిగి ఒదిగిపోయెను. ఎప్పుడైతే వింధ్యపర్వతము అగస్త్యుని చూచెనో అప్పుడే లోకమందు ఉపద్రవములన్నియు తొలగిపోయి గ్రహగమనము లన్నియు యథాప్రకారముగ కొనసాగెను. అంతట పురుష రూపమును దాల్చిన వింధ్యపర్వతము అగస్త్యునికి సాష్టాంగ నమస్కారము గావించి

అతిథి సత్కార్యములను ఒనరించి "స్వామి! ఈ సేవకుని ఆజ్ఞాపించి రక్షించుము" అని ప్రార్థించెను. అనగా అగస్త్యుని యొక్క దివ్యవిగ్రహ తపోసంపన్నత, కాంతివైభవము ఎట్టివో మనకు ఇక్కడ తెలియుచున్నది. కావుననే లోకసంరక్షణార్థం మహర్షులు మహిమాన్వి తులుగ అరుదెంతు రనుట ఈ వింధ్యపర్వత గర్వభంగమే మనకు నిదర్శనము.

అంతట ఇదియే అదనుగ గుర్తించిన అగస్త్యుడు తాను దేవతలకు ఇచ్చిన మాటను గుర్తుంచుకొని వింధ్యపర్వతముతో అగస్త్యుడు ఇలా పలికెను. "ఓ పర్వతరాజ! మా దంపతులము ఇరువురము దక్షిణా పథమునకు తీర్థయాత్రలకు వెళ్ళుచున్నాము. కావున మేము పెద్దవారమై యున్నాము. నీ శృంగగిరములను ఎక్కిదిగుట మాకు కష్టము. మేము తిరిగివచ్చునంతవరకు నీవు ఈ భూమికి సమముగ ఉండవలెనని" పలికెను. ఆ మాటలను విన్న వింధ్యము "ఓ మహాత్మా! ఈ చరాచర ప్రపంచమున నీ ఆజ్ఞను దిక్కరించువారు ఎవరు. మీరు చెప్పినట్లే చేసెదను. నన్ను కటాక్షింపుడు" అని పలికెను. అగస్త్యుడు సంతసించి ముందుకు వెళ్ళెను. పై విషయములనుబట్టి అసూయ గ్రస్తుల గతి ఎలా ఉంటుందో మనకు తెలుస్తుంది.లోక సామెత "తాడి తన్నువాడుంటే తలదన్ను వాడుండును" అని తెలుస్తుంది.

### 16. అగస్త్యుడు దక్షిణకాశీకి పోవుట

అగస్త్యుడు పైవిధముగ లోకమునకు ఉపద్రవమును కలిగించు వింధ్యపర్వతము యొక్క గర్వమును అణచి దక్షిణకాశీకి భార్య సహితుడై బయలుదేరెను. దారిలో గోదావరితీరమునగల ఆంధ్ర ప్రదేశమును చేరెను. అటుపై పంపాసరోవరము, దండకారణ్యాము దాటి పట్టిసము, కోటిపల్లి, పలివెల మొదలగు చోట్లను దర్శించి దక్షవాటము చేరి అచ్చట భీమేశ్వరుని సేవించెను. దీనినిబట్టి అగస్త్యుడు పరోపకార పరాయణుడు కావున తీర్థస్నాన,

జపహోమ, దేవతార్చన మొదలగునవి అన్నియు అతనికి పరోప కారము నకు హృదయమూల ఆత్మశక్తికి ప్రేరేపకములుగ పరోపకారముకంటె పరమ ధర్మములేదు అనునట్లుగ అగస్త్యుని ఇతివృత్తము వలన మనకు తెలియు చున్నది.

అటుపై భార్యసహితుడైన అగస్త్యుడు వీరభద్రశిఖరమును చూచి అందలి విశేషములను లోపాముద్రకు తెలిపి ముందుకు సాగి కొల్హాపురము నకు వెళ్ళి లక్ష్మీ దర్శనము చేసుకొనెను.

**17. అగస్త్య కృత లక్ష్మీస్తోత్రము**

అగస్త్య మహర్షి లక్ష్మిని ఇట్లు స్తుతించెను.

1. ఓ తల్లీ! నీవు చంద్రునియందు వెన్నెలవు, సూర్యునియందు ప్రకాశమవు, అగ్నియందు దాహశక్తివి. అట్టి కళ్యాణ మూర్తివగు నీకు నమస్కారము.
2. అమ్మా! బ్రహ్మ విష్ణుమహేశ్వరులు నీ కరుణా ప్రభావముననే సృష్టి స్థితిలయములను జరుపుచుందురు.
3. ఓ ఇందిరా! పండితుడన్నను సూర్యుడన్నను వివేకి అన్నను వదాన్యు డన్నను ధన్యుడన్నను మన్మధుడన్నను కళావిదుడన్నను ఎవరు ఏమన్ననూ నీ చూపు దర్శనమాత్రము చేతనే కదా! నీ అంశ విశేషమే పురుషుల యందు భాగ్యముగను స్త్రీలయందు వికాశరేఖగను సమస్తము నందు సొంపుగను కానవచ్చును.
4. దేవీ! నీవు కల చోటు రసవంతముగను నీవు లేనిచోటు రస విహీనము గను ఉండును. నీవు కలవాడే సమస్తము కలవాడు నీవు లేని వాడు ఏమియు లేనివాడే.
5. అబ్ధికన్యా! జలపూర్ణములగు బంగారుకుండలు తొండములతోనెత్తి పట్టి ఇరువంకల ఏనుగులు నిన్ను కొలచుచుండగ శంఖపద్మ, మహాపద్మ, మకరాది నిధులు నియమమున నిన్ను అర్చించుచుండగ వింజామరలు

దాల్చి దేవ గంధర్వ గుహ్యాక అంగనలు నీకు వీచోపులిడు చుండగ మరియొకవంక ఇంద్రాది దివిజపతులు చేతులు ఓడ్చి స్తుతించుచుండగ పద్మమధ్యమున నిండుకొలువుండి అఖిల లోకములను రక్షించు జగజ్జననివగు నీకు కోటి మ్రొక్కులుఅని అనేక విధముల లక్ష్మిని స్తుతించగ ఆమె ప్రత్యక్షమై ఇట్లు ఆశీర్వదించెను.

"ఓ ఋషివరా ! నీ స్తుతికి నేను చాలా సంతసించితిని. రాగల 29వ ద్వాపరమున వ్యాసుడవై వారణాసిలో వేద శాస్త్ర పురాణములను, సంహితలను, ధర్మశాస్త్రములను తెలుసుకొనగలవు. ఇప్పుడు తుంగభద్రానదీ తీరమునకు వెళ్ళి కిష్కింధ ప్రాంతమునగల 'స్వామిమల' అను అడవిలో ఉన్న 'కుమారస్వామిని' దర్శించి అతని వలన కాశీ గొప్పతనమును తెలుసుకొనుము" అని పలికి లోపాముద్రను చూచి ఆమెకు అనేక దివ్యాభరణములను ఇచ్చి సంతసముగ వీడ్కోలు చెప్పెను.

అటుపై ఇలా తీర్థయాత్రలను చేయుచున్న అగస్త్యదంపతులు ద్వాదశలింగములలో మహత్తరమైన శ్రీశైల క్షేత్రమును చేరిరి. అగస్త్యుడు శ్రీశైల మహాత్మ్యమును తెలిపి 'శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే' అనునట్లుగ శ్రీశైల పర్వత శిఖరమును చూచినంతనే ముక్తికలుగునని చెప్పెను. ఆ సమయమున లోపాముద్ర తన సందేహమును ఇలా వ్యక్తపరచెను. "ఓ నాథా! ఈ శిఖరమును చూచి నంతనే ముక్తి కలుగునా! 'కాశ్యాంతు మరణాన్ ముక్తిః' అన్నారు గదా! కాశీలో మరణిస్తే ముక్తి అంటారే" అని పలికెను. ఇలా వారిరువురు తర్కవితర్కములు కొనసాగెను. కాన ఇకపై లోపాముద్ర-అగస్త్యుల సంవాదమెట్లు సాగెనో పరికింతుము.

### 18. లోపాముద్ర - అగస్త్యుల సంవాదము

లోపాముద్ర అగస్త్యుని చూచి "ఓ దేవా! కొందరు కేవలము విజ్ఞానమే చాలందురు. మరికొందరు విజ్ఞాన సహితమైన కర్మ ముఖ్య మందురు.

వ్రతదానక్రతు యోగములు, తపోబ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్యాస ఆశ్రమములు దేనికి అవియే ముక్తిప్రదములు  అందురు. కాన వీని అన్నిటిలో సులభముక్తి మార్గము ఏదియో శెలవు ఇవ్వు"డని పలికెను.

ఆ మాటలు విన్న అగస్త్యుడు తన సతీమణియగు లోపాముద్రకే కాక, లోకజన హితము కొరకు కొన్ని సందేశములను చెప్పెను. "ఓ సాధ్వీ! శ్రీశైలాదులన్నియూ ముక్తి ప్రదములే. ఇవి కాశీ ప్రాప్తికరములు కూడా కాని, కాశియే సాక్షాత్తుగ ముక్తిహేతువు. అందుచే కాశీ గొప్పది. అలాగే ప్రయాగ, నైమిశారణ్య, కురుక్షేత్రము, గంగా ద్వారము, ఋషికేశ్, హరిద్వార్, అవంతిక, అయోధ్య, మధుర, ద్వారక, సరస్వతి మొదలగునవి అన్నియు ముక్తికారకములగు తీర్థములు. (అయోధ్య మధురా మాయా కాశీ కాంచి అవంతిక ద్వారక సప్తైతే మోక్షదాయికాః) అని తీర్థక్షేత్ర మహాత్మ్యమును చెప్పుచూ మరికొన్ని విశేషములను ఇలా చెప్పెను.

"ఓ దేవీ! నీకొక రహస్యమును చెప్పెదను. ఈశ్వర కటాక్షము లేకపోయినచో తీర్థయాత్ర చేయవలెనని బుద్ధియే పుట్టదు. తీర్థయాత్ర ఆకాంక్ష లేనిచో ప్రతిబంధకమగు పాపముపోదు. ఆ పాపము నశించు నంతవరకు కాశీ ప్రాప్తిలేదు. కాశీవాస యోగము లేనిచో విజ్ఞానము విస్తరింపదు. 'మోక్షేతి జ్ఞానం అన్యత్ర విజ్ఞానమ్' అన్నట్లుగ మోక్షము కొరకే జ్ఞానము మిగిలిన ఐహిక ప్రపంచ విషయములన్నియు తెలుసు కొనుట విజ్ఞానము. వేదాంత వాక్యములవలన పుట్టిన సుజ్ఞానమే జ్ఞానము. మిగిలిన దల్లా అజ్ఞానము". అని చెప్పుచూ మరికొన్ని రహస్యములను కూడా ఇలా చెప్పెను.

"ఓ తరుణీ ! మానస తీర్థములే మోక్ష హేతువులు" బాహ్య తీర్థముల కంటే ఇవి మేలు. నీకు వరుసగా మానస తీర్థముల గూర్చి చెప్పెదను వినుము. సత్యము, ఇంద్రియనిగ్రహము, అసూయ లేకుండుట, దానము, దయ,

సంతోషము, బ్రహ్మచర్యము, ధైర్యము,యమము, సమత్వము, విజ్ఞానము ఇవి మానస తీర్థములు. ఇందులో మనోస్నానము లేని వారికి బాహ్యశారీరక స్నానములెన్ని చేసినను లాభము లేదు. ముఖ్యముగ బాహ్యతీర్థములలో స్నానములలో మోక్షమిచ్చునవి నిత్యము అందులో మునిగి తేలెడి చేపలకు మొసళ్ళకు తాబేళ్ళకు ముందు మోక్షము కలుగవలయును గదా! 'కల్లు కుండ ఎన్నిమార్లు కడిగిన శుద్ధియగును'. కావున మానసిక తీర్థములు అలవరుచుకున్నగాని బాహ్యతీర్థములకు ప్రయోజనము లేదు. దేహము నందలి అంగములకు వలె తీర్థములకు బేధములు కలవు. మరికొన్ని విశేషములను చెప్పెదను వినుము. ఎవ్వరు ఏమి యిచ్చినను పుచ్చుకొనక పోవుట, అహంకారము లేకుండుట, కోపము చంపుకొనుట, ఆలస్యము చేయకుండుట, సత్యనిష్ట , సమాధానము, శ్రద్ధ, హేతునిష్ట మొదలయినవి అన్నియూ సాంగోపాంగములైన ఫలములిచ్చును. ఎన్ని తీర్థములలో స్నానమాడిన గాని కాశీతీర్థ ప్రాప్తి కలుగదు. కాశీ తీర్థమున స్నానము ఆడనివాడు లక్షతీర్థములలో స్నానమాడినను మోక్షలక్షిని పొందలేని వాడని"ఉదా హరణ పూర్వకముగ కొన్ని పూర్వగాధలతో ఆమెకు అగస్త్యుడు తెలిపెను.

అటుపై సతీసహితుడైన అగస్త్యుడు శ్రీశైలమునకు ప్రదక్షిణ నమస్కారములను చేసి ముందునకు వెళ్ళి 'స్వామిమల' చేరి అందు కుమారస్వామిని దర్శించెను.

### 19. కుమార అగస్త్యుల సంవాదము

కుమారస్వామి పత్నీసహితుడైన అగస్త్యమహర్షిని కుశలప్రశ్నల అనంతరం వచ్చినపని ఏమి అడిగెను. కొల్హాపుర లక్ష్మి ఆనతి ఇచ్చిన విధముగ అగస్త్యుడు కాశీ మాహాత్మ్యమును తెలుపమని అడిగెను. అంత కుమారస్వామి "ఓ అగస్త్యా ! కాశీ క్షేత్ర మహాత్మ్యము వర్ణింప ఎవరివలన

సాధ్యము కాదు. అయినను యథాశక్తి నేను నీకు తెలిపెద"నని పలికెను. అంత అగస్త్యుడు ఇలా పలికెను. మొట్టమొదట అగస్త్యుడు కాశీకి గల నామములను, విశేషములను తెలుపమనెను. వాటినన్నింటిని కుమార స్వామికి తెలిపెను. అటుపై మణికర్ణికా మాహాత్మ్యము, కాశీతీర్థ మాహాత్మ్యము, కాలభైరవ చరిత్రము, హరికేశ చరిత్రము, జ్ఞానవాటికాతీర్థ మహాత్మ్యము, కళావతి కథలను అగస్త్యునకు తెలిపెను.

అటుపై సదాచారనిరూపణము చేయుమనిన అందులకు కుమార స్వామి "ఓ ఋషిపుంగవ ! పూర్వము మనువు, అత్రి, భృగువు, భరద్వాజుడు, యాజ్ఞవల్క్యుడు, ఉసనసుడు, అంగిరసుడు, యముడు, ఆపస్తంబుడు, సంవర్తుడు, కాత్యాయనుడు, బృహస్పతి, శాతాతపుడు, శంఖుడు, లిఖితుడు, పరాశరుడు మున్నగువారు సదాచారమును నిరూపించిరి. అవి అన్నియూ తెలుప సాధ్యము కాదు'' అని దిఙ్మాత్రముగ తెలిపెను. అటుపై కాశీనగరమును గూర్చి సమస్తవిషయములను అగస్త్యునకు కుమారస్వామి తెలిపెను. ఇవి అన్నియూ విని అగస్త్యుడు ఆనందించి భార్యాసహితుడై (భార్యతో కూడి) స్వామిని ఆరాధించి ముందుకు పయనమయ్యెను.[1]

## 20. అగస్త్య-వ్యాసుల వృత్తాంతము

కాశీక్షేత్రమును శపింపపూనిన కారణమున వ్యాసుడు శిష్య సమేతుడై వారణాసి నుండి విశ్వేశ్వరునిచే వెలివేయబడగ లోపాముద్ర సహితుడగు అగస్త్యునికి ఎదురేగెను. ఒకరినొకరు కుశలప్రశ్నల అనంతరము బిల్వ వనమునందలి చలువరాతి తిన్నెలపై ఇష్టకథాగోష్ఠిలో అనేక విషయములను చర్చించుకొనిరి. అంత వ్యాసుని దక్షిణ కాశీయగు ద్రాక్షారామమునకు ప్రయాణమును గుర్తించి అగస్త్యుడు అతనికి ద్రాక్షా రామముయొక్క మహిమను తెలిపి వ్యాసుని కోరికపై ఆకాశమునకు ఎగిరింపచేసి వ్యాసాదు

1. ఈ విషయము స్కాందపురాణము, భీమఖండమున కలదు.

లకు భీమమండలమును చూపి వరుసగ 12 తీర్థక్షేత్రములను గూర్చి తెలిపెను. అవి ఏమనగ 1) ఇంద్ర దేశము 2) సిద్దేశ్వరము 3) యోగీశము 4) కాళేశ్వరము 5) శమనేశము 6) వీర భద్రేశము 7) బ్రహ్మేశము 8) కపాలేశ్వరము 9) కుక్కుటేశ్వరము 10) సోమనాథేశ్వరము 11) శ్రీ మహేశము 12) రామతీర్థము.

ఈ పన్నెండు క్షేత్రమహిమలను తెలిపి వానినన్నింటిని వేరువేరుగ నిరూపించి అటుపై పంచతీర్థములైన "దక్షాధ్వరనాలము, అఖిలేష్ట సంసుద్ధి, సోమేశ్వరము, హైమవతము, సప్తగోదావరము" అను పంచ తీర్థ మాహాత్మ్యములను చెప్పి వ్యాసుని అందులో ఓలలాడించెను. అటుపై అగస్త్యుడు వ్యాసునితో భీమేశ్వర ఆలయ మాహాత్మ్యమును గూర్చి తెలిపెడి గాథలతో ఆ క్షేత్రమున ప్రవేశించెను. వ్యాసుడు శివుని అర్చించి బ్రహ్మానందమును పొందెను. అటుపై అగస్త్యుడు సగౌరవముగ అతనిని వీడ్కొలిపి భార్యాసహితుడై తన ఆశ్రమమునకు పోయి సుఖముగ కాలమును గడిపెను. పరశురాముడు ఒకప్పుడు అగస్త్యమహర్షిని దర్శించి అతనిచే 'కృష్ణామృత స్తోత్రమును' విని కృష్ణకవచ ధరుడై ఇరువదియొక్క మారులు రాజులను చంపెను.

### 21. అగస్త్యుడు భూభారమును తగ్గించుట

పూర్వము హిమవత్పర్వతముపై పార్వతీ పరమేశ్వరుల వివాహము వైభవముగ జరుగుచుండెను. ఆ కళ్యాణమును యక్ష కిన్నెర కింపురుష సిద్ధులెందరో ఆనందముగ తిలకించుచుండిరి. కాని భూదేవికి భారము ఎక్కువ అయి దక్షిణ దిక్కున పైకిలేచి ఉత్తర దిక్కున కృంగిపోవు చుండుట సంభవించెను. ఆ విషయము గుర్తించిన ఈశ్వరుడు అగస్త్యుని పిలిచి "ఓ కుంభసంభవా! ఈ ఉపద్రవము నుండి కాపాడగలిగిన వాడివి నువ్వొక్కడివే" అని చెప్పగ అగస్త్యుడు లోపాముద్రనుతోడ్కొని శిష్య సమేతముగ దక్షిణదిక్కునకు పోయెను. దక్షిణదిక్కు భూభారము తగ్గుటచే

భూమి యథాస్థితిగ సమస్థితికి వచ్చెను. కావున అగస్త్యుడు ఈశ్వరుని కటాక్షము పొంది సశిష్యుడై దక్షిణ దిక్కునుండియే తన దివ్యదృష్టితో పార్వతీపరమేశ్వరుల వివాహమును చూచి ఆనందభరితుడయ్యెను[1].

## 22. అగస్త్యుడు ఇంద్రద్యుమ్నుని శపించుట

పూర్వము ఒకానొకనాడు ద్రవిడదేశాధీశుడగు ఇంద్ర ద్యుమ్నుడు విష్ణుభక్తుడై నారాయణుని ఆరాధించుచూ ఒక పర్వతాగ్రమున పూజలో మునిగియుండెను. అచటికి కుంభసంభవుడైన అగస్త్యుడు వెళ్ళెను. కాని ఇంద్రద్యుమ్నుడు అతనిని చూసీ చూడనట్లుగనే ఏమరు పాటుగ నుండెను. అగస్త్యుడు అతని నిర్లక్ష్య బుద్ధికి కోపించి "నీవు నా రాక లెక్కచేయలేదు కావున నీచ గజయోని యందు పుట్టుము" అని శాపోదకమును వదిలెను. అంత ఇంద్రద్యుమ్నుడు "ఓ మహాత్మా! నన్ను రక్షింపుము. నేను మౌన ధ్యానముతో ఏకాగ్రచిత్తుడనై సర్వాత్ముడైన నారాయణుని తలచుకొనుచు తన్మయుడనై నిన్ను చూడలేకపోయితిని. అంతియే కాని నా అహంకార దురితము ఏమియూ కాదని" ప్రార్థించెను.

అంత అగస్త్యుడు "ఓ రాజ! ఎట్టి పుణ్యాత్ములైనను విప్రులను చూచి ఇచ్ఛతోగాని పరేచ్ఛతోగాని ఏమరిచిగాని అవమానించినచో అది వారికి దుష్కృతమే అగును. నీవు పుణ్యాత్ముడవు. నేటి ఈ విప్ర అవమాన దోషము నిలిచియున్నచో ముందు ముందు నీకు అది ప్రమాద హేతువ గును. కావున నీవు దోషమును పరిహరింప గజజన్మము ఎత్తక తప్పదు" అని పలికెను.

"కాని ఇక్కడ మరియొక విషయము దాగియున్నది. నీవు ఏ నారాయణునిపైన భక్తిని కలిగి పూజించుచున్నావో అదే నారాయణుని

---

1. ఈ వృత్తాంతమును శివపురాణమున కలదు.

వలన ఏనుగు జన్మను ఎత్తి ఆ నారాయణుని చరణ సేవలో ముక్తిని పొందగలవు" అని చెప్పి తన దారిన తాను వెళ్ళెను.

ఇదే వృత్తాంతము భాగవతమున గజేంద్రమోక్షము నందు కలదు. నాటి ఇంద్రద్యుమ్నుడే ఏనుగై పుట్టి ఒక కొలనులో నీరు త్రాగు సమయమున ఒక మొసలిచే పట్టుబడి మహావిష్ణువుని "నీవు తప్ప ఇతః పరంబెరుగను" అని ప్రార్థింప శరణార్థియై వేడిన గజమును రక్షించిన విధానమును శ్రీమద్భాగవతమున బమ్మెర పోతనామాత్యుడు "సిరికిం జెప్పడు శంఖచక్ర యుగమున్ చేదోయి సంధింపడు" అను పద్యమున భక్త వత్సలుడైన భగవంతుని గూర్చియు, ఆ నారాయణుని భక్త వాత్సల్యము ఎట్టిదో అత్యద్భుతముగ వర్ణించెను.

## 23. అగస్త్యుడు మణిమంతుని శపించుట

పూర్వము ఒకానొక సమయమున 'కుశవతి' అను పుణ్యనదీ తీరమున దేవతలు సత్రయాగమును చేయుచుండిరి. ఆ యాగమున దేవతలచే ఆహ్వానింపబడిన కుబేరుడు పుష్పకవిమానమున శతమహా సంఖ్య కలిగిన యక్షరాక్షసబలములతో ప్రియస్నేహితుడైన మణి మంతుడను వానితో కూడి ఆకాశమార్గమున పోవుచుండెను. దారిలో యమునానది కల చోట ఆకసమున పోవు విమానమునుండి మణి మంతుడు ఉమ్మివేసెను. అది యమునా తీరమున ఊర్ధ్వ బాహుడై ఉగ్ర తపము చేయుచున్న అగస్త్యుని పై పడెను. అగస్త్యుడు తన తపోశక్తిచేత విమానమును ఆపుచేసెను. వెంటనే కుబేరుడు క్రిందకి వచ్చి అగస్త్యుని నమస్కరించగ అగస్త్యుడు కుబేరుని చూచి "మూర్ఖుడగు నీ మిత్రుడు నాపై ఉమ్మివేసెను కాన ఆతడు ఒక మానవునిచేతిలో చనిపోవును. అతని పరివారమైన ఈ యక్షరాక్షస గణములెల్ల ఆ మానవునిచేతనే సంహరింప బడును" అని శపించి పంపివేసెను. కుబేరుడు, మణిమంతుడును

అగస్త్యుని కటాక్షించమని ప్రార్థించి శెలవు గైకొని వెళ్ళిరి. ఈ ఇతి వృత్తము మనకు భారతమున అరణ్యపర్వములో సౌగంధికా ప్రసవాపహరణ సమయమున మణిమంతుడు, అతని పరివారమును భీమసేనుని వలన చనిపోయినట్లుగ ఇతివృత్తము కలదు[1]. దీనిని బట్టి మనకు 'మహర్షుల వాక్యములు మహిమాన్విత ప్రభావములుగ' ఏదో ఒక కార్యనిమిత్తమై కలుగుచుండునని పెద్దల మాటగ తెలియుచున్నది.

**24. అగస్త్యుడు భద్రాసురుని అనుగ్రహించుట**

కృతయుగమున నవవర్షములలో ఒక వర్షమునకు భద్రాసుర నామధేయము కలవాడే భద్రాస్వుడను రాజు. అతని భార్యపేరు కాంతిమతి. ఒకానొకనాడు వారిరువురు అగస్త్యుని వద్దకు వచ్చి ఎన్నో మన్ననలను పొందిరి. అప్పుడు అగస్త్యుడు వారిరువురు పద్మనాభ వ్రత సంబంధమగు దీపమాలికలను చూచిన సమయమున వారాజన్మమున అంత ఐశ్వర్యమును పొందిరి అని పూర్వజన్మ వృత్తాంతమును తెలిపి అగస్త్యుడు వారికి ఆ వ్రత విధానమును గూర్చి బోధించెను. అటుపై పుష్కర తీర్థమునకు వెళ్ళి కుమారస్వామిని సేవించి భద్రాస్వునకు మరికొన్ని వృత్తాంతములను తెలిపెను. అగస్త్యునకు ఇలామృతవర్షమున ఉన్న సమయమున నారాయణుడు వైకుంఠపురమున నిజభవనమును చూపి "వత్సా! ఈ చరాచరము జలరూపము ఆవరించి 'వరుణ అభిధేయుడగు' పేరు గలిగన నారాయణుడను నేను. నీవు నా భక్తుడగుట వలన నీకు ఏ కాలమందును లోటురాదు" అని చెప్పి పంపెను.

**25. అగస్త్యగీత - అగస్త్యసంహిత**

అగస్త్యమహర్షి తన జీవితాంతము జగత్తునకు మేలుకొరకై

---

1. ఈ ఇతివృత్తము మహాభారతము అరణ్యపర్వమున, వరాహపురాణము నందు కలదు.

పాటుపడిన మహనీయుడు. మహాభారతమునందు శాంతి పర్వమున కల ఈతని ప్రసిద్ధ మహా విద్యాబోధనయే అగస్త్యగీత నామముగ చిర స్థాయియై నిలచినది. అలాగే అగస్త్యసంహిత కూడ రామచంద్ర, విష్ణు వామనాద్యవతార పూజావిధానములను శాస్త్రోత్తరముగ తెలిపెను. దీనికి అగస్త్యసంహిత అని పేరు. ఇతని జీవితమే ప్రసిద్ధ బ్రహ్మవిద్యా బోధకము. ఇతని తత్త్వసారమంతయు "శివుడే దాత శివుడే భోక్త శివుడు చేయున్ మఖాది క్రియల్ శివుడే విశ్వము నే శివుండ ............" అను అద్వైత అనుభవ దీక్షాపరాయణుడే అగస్త్యుడు. సతీసమేతుడై సమస్తతీర్థము లందు స్నాన మాడిన అగస్త్యమహర్షి ఇలా అన్నాడు.

"తీర్థములు మానసములు ముక్తిప్రదములు
బాహ్యతీర్థావళులు ముక్తిఫలము లీవు"

అని తన సతీమణికి తీర్థ పరమార్థమును తెలిపినవాడు.

**26. ఆదిత్య కవచము**

" జపాకుసుమ సంకాశం ద్విభుజం పద్మహస్తకం
సింధూరాంబర మాల్యంచ రక్తగంధాను లేపనమ్
మాణిక్య రత్నఖచిత సర్వాభరణభూషితం
ధ్యాయేత్పలేత్సువర్ణాభం సూర్యస్య కవచం ముదా
ఘృణిః పాతు శిరోదేశే సూర్యః పాతు లలాటకం
ఆదిత్యో లోచనే పాతు శ్రతీ పాతు దివాకరః
ఘ్రాణం పాతు సదా భానుః ముఖం పాతు సదా రవిః
జిహ్వాం పాతు జగన్నేత్రః కంఠం పాతు విభావసుః
స్కంధౌ గ్రహపతిః పాతు భుజౌ పాతు ప్రభాకరః
కరా వజ్జకరః పాతు హృదయం పాతు భానుమాన్
మధ్యం పాతు సుసప్తాశ్వో నాభిం పాతు నభోమణిః

ద్వాదశాత్మా కటిం పాతు సవితా పాతు సక్థినీ
ఊరూ పాతు సురశ్రేష్ఠో జానునీ పాతు భాస్కరః
జంఘే మే పాతు మార్తాండో గుల్ఫౌ పాతు త్విషాంపతిః
పాదౌ దినమణిః పాతు పాతు మిత్రోఽఖిలం వపుః
ఆదిత్య కవచం పుణ్యం అభేద్యం వజ్ర సన్నిభమ్
సర్వరోగ భయాదిభ్యో ముచ్యతే నాత్ర సంశయః
సంవత్సర ముపాసిత్వా సామ్రాజ్య పదవీం లభేత్
అనేక రత్న సంయుక్తం స్వర్ణ మాణిక్య భూషణం
కల్పవృక్ష సమాకీర్ణం కదంబ కుసుమప్రియం
అశేషరోగ శాంత్యర్థం ధ్యాయేదాదిత్య మండలం".

సింధూరవర్ణాయ సుమండలాయ సువర్ణ రత్నాభరణాయ తుభ్యం
పద్మాది నేత్రే చ సుపంకజాయ బ్రహ్మేంద్ర నారాయణ శంకరాయ
సంరక్త చూర్ణం ససువర్ణతోయం సకుంకుమాభం సకుశంసపుష్పమ్
ప్రదత్తమాదాయ చ హేమపాత్రే ప్రశస్తనాదం భగవన్ ప్రసీద.

**27. అగస్త్యుడు చెప్పిన ఆదిత్య స్తోత్రము**

"ధ్యాయేత్సూర్యమనంతకోటి కిరణం తేజోమయం భాస్కరం
భక్తానామభయప్రదం దినకరం జ్యోతిర్మయం శంకరమ్
ఆదిత్యం జగదీశమచ్యుత మజం త్రైలోక్య చూడామణిం
భక్తాభీష్ట వరప్రదం దినమణిం మార్తాండ మధ్యం శుభమ్
కాలాత్మా సర్వభూతాత్మా వేదాత్మా విశ్వతోముఖః
జన్మ మృత్యు జరావ్యాధి సంసార భయనాశనః
బ్రహ్మ స్వరూప ఉదయే మధ్యాహ్నే తు మహేశ్వరః
అస్త్యకాలే స్వయం విష్ణుః త్రయీమూర్తిః దివాకరః
పద్మహస్తః పరంజ్యోతిః పరేశాయ నమోనమః

అండయోనిర్మహాసాక్షీ ఆదిత్యాయ నమోనమః
ధర్మమూర్తిర్దయామూర్తిః సత్యమూర్తిర్నమోనమః
సకలేశాయ సూర్యాయ క్షాంతేశాయ నమోనమః

## 28. అగస్త్య అర్ఘ్యప్రదాన విధానము

అగస్త్యమహర్షి ప్రకాశవంతమైన నక్షత్రరూపమున భాద్రపద మాసమున దర్శనమిచ్చునని జనప్రతీతి. అగస్త్య నక్షత్రము ఉదయము కాగానే విప్రులు సుస్నాతులై కాశపుష్పముతో అగస్త్యప్రతిమను చేసి పుష్పధూపాదులతో అర్చించి జాగరణచేసి తమకు కావలసిన కోరికలను పొందుటకు మోక్షపదప్రాప్తిని పొందుటకు ఈ క్రింది శ్లోకములను చదివెదరు. ఆ శ్లోకాలను చదివిన పిమ్మట అర్ఘ్యపార్ఘ్యాదులను ఒసగుదురు. అటుపై అతని ధర్మపత్ని అయిన లోపాముద్ర సాధ్విని ఉద్దేశించి స్తోత్రము కావించి అర్ఘ్యము వదలి అగస్త్యప్రతిమను పూజించి విప్రులకు గోదానము మొదలగు నవి ఇచ్చెదరు. ఈ దంపతుల పూజాఫలము వలన వారి ఆశీర్వాదముతో భక్తిముక్తులు కలుగునని జనప్రతీతి. ఈ క్రింది శ్లోకము లను స్తోత్ర పారాయణముగ భాద్రపదమాసమున నక్షత్ర రూపమునగల లోపాముద్ర అగస్త్యుల స్తుతశ్లోకములు ఇవే.

"కాశపుష్ప ప్రతీకాశ వహ్ని మారుతసంభవ
మిత్రావరుణయోః పుత్ర కుంభయోనే నమోస్తుతే
వింధ్య వృద్ధిక్షయకర మేఘతోయ విషావహః
రత్న వల్లభ దేవేశ లంకావాస నమోస్తుతే
వాతాపిర్భక్షితో యేన సముద్రశ్శోషితః పురా
లోపాముద్రాపతి శ్రీమాన్ యోऽసౌ తస్మై నమోనమః
యోనోదితేన పాపాని విలయం యాంతి వ్యాధయః
తస్మై నమోస్త్వగస్త్యాయ సశిష్యాయ చ పుత్రిణే

"రాజపుత్రి మహాభాగే ఋషిపత్ని వరాననే
లోపాముద్ర నమస్తుభ్యమర్ఘ్యం మే ప్రతి గృహ్యతామ్
అగస్త్యాయ నమస్తేఽస్తు అగస్త్యేఽస్మిన్ ఘటేస్థితః
అగస్త్యో ద్విజరూపేణ ప్రతిగృహ్ణాతు సత్కృతః
అగస్త్యస్సప్తజన్మాఘం నాశయిత్వాఽవయోరయం
అపత్యం విమలం సౌఖ్యం ప్రయచ్ఛతు మహామునిః"

**అగస్త్యమహర్షి స్తుతి**

"కుంభ సంభవా! శంభ పూజితా! లోపాముద్ర పతిదేవా! అగస్త్య మహర్షీ!
అంబ జగదాంబ కాశీవిశాలాక్షీ అన్నపూర్ణేశ్వరుల భక్తితత్పరా!
శంభాది దేవతాది ప్రియ మహర్షీ! శ్రీఆదిత్య హృదయ రామోపదేశా!
గంభీర తపోధీశాలా!వింధ్య గర్వాపహరణా! హే ఋషే! నమస్తే నమః"

❖ ❖ ❖

# 2. అత్రి మహర్షి

అత్రిమహర్షి సప్తర్షులలో ఒకడు. అనసూయా మహాసాధ్వికి ప్రాణనాథుడు. తన తపోప్రభావముచేత లోకమున ఉత్తమమైన పురుషుడుగా ఉద్భవించెను. ఇకపై అత్రిమహర్షి జననాది విశేషము లను పరిశీలించెదము.

**1. అత్రి జననము**

భాగవతమున చెప్పబడిన ఇతివృత్తముల ఆధారముగ అత్రి జననముగూర్చి ఈ విధముగ చెప్పబడెను. సృష్టికర్తయగు బ్రహ్మ తన సహాయకుడుగ ప్రపంచమున కొంత సృష్టికి కారకుడుగ ఉండునను ఉద్దేశ్యముతో తన మనస్సునుండి అత్రిని సృష్టించెను. తన అంశ జననము పొందిన అత్రి "తండ్రీ! నీవు నన్ను ఏ కారణముచేత సృష్టించితివి? ఆ కార్యమేదో నాకు తెలుపుము" అని పలికెను. అంత బ్రహ్మ "నీవు మహా తపస్సు చేసి లోకసంరక్షణకై కొందరిని సృజింపవలయును. సహాయమును నేను చేయుదును" అని బ్రహ్మ అత్రిమహర్షిని తపస్సునకు పంపి తాను తన సత్యలోకమున గృహము నకు చేరెను.

**2. అత్రి తపోనియతి**

బ్రహ్మ ఆజ్ఞానుసారము అత్రి ఒక వనమున ఆశ్రమమును నిర్మించుకొని తపోవృత్తిని కొనసాగించుచుండెను. ఇలా ఉండగా తానొక నాడు ఇలా తలంచెను. "పంచ భూతములతో ఏర్పడి రక్తమాంస ఎముకలచే

హేయమైన ఈ శరీరముపై నిర్మమత్వము" కలిగి ఈ దేహముకాని ఆత్మను దర్శించి తదనంతరము అంతర్లీనమైన ఆనందమును పొందుటకు యమనియమములు అను అష్టాంగయోగములు, దాన ధర్మములు, తపో వ్రతములు ఏర్పడినవి. తాను కాని దేహముపై మమ కారము నశింప చేసు కొనుట తద్విరుద్ధమైన తాను అనెడి ఆత్మవలన ఆనందమును అనుభవించు శక్తిని పొందుటకు దేహమును ఉపవాసము మొదలైన కఠిననియమములతో నశింపచేయవలెను. కావున మహర్షులు అనువారు దేహభ్రాంతి వదలి ఆత్మ ఆనంద స్థితిని పొందుటకు ఆత్మ చైతన్యముతో శాశ్వత బ్రహ్మైక్య సిద్ధికి నిత్యము దైవనామస్మరణచే తపోనిష్ఠగ ఉండుటకు మార్గమును ఎంచుకొనును. ఈ స్థితి ఉన్నవారు అనంత శక్తివంతులు. కావున అత్రి మహర్షి కూడా ఈ సాధనా మార్గమును ఎంచుకొని గొప్ప తపోదీక్షాపరుడయ్యెను. ఇలా కాలము గడుచుచున్న కొలది తపో నిష్ఠలో ఉన్న అత్రి మహర్షికి తన నేత్రములనుండి గొప్ప తేజస్సు పుట్టెను. ఆ తేజస్సు భూమి ఆకాశముల నడుమ వ్యాపించెను. దశదిశలు ఆ తేజస్సు ఆవరించెను. దశదిశలను ఆవరించిన ఆ శక్తి అటుపై సముద్ర గర్భమున పడెను. అంత బ్రహ్మదేవుడు గుర్తెరిగి ఆ తేజస్సును తాను గ్రహించెను.

అంత దేవతలు అది చూచి బ్రహ్మదేవుని సోమమంత్రముతో పొగడిరి. (సోముడు-చంద్రుడు) అప్పుడు బ్రహ్మ ఆ తేజస్సుకు పురుష రూపము ఇచ్చి అత్రిమహామునికి వివాహమైన పిమ్మట అత్రి అనసూయ లకు తన అంశముచే చంద్రుడు జన్మించుననియు నా తేజో అంశమే ఒకటి దేవతలు రాక్షసులు అమృతమునకై క్షీరసాగరమును మథించు సమయమున శశాంకుడుగ జన్మించునని దేవతలకు చెప్పి వెళ్ళిపోయెను. ఇలా అత్రి మహర్షి ఇతివృత్తమును కూడా తాను కొనసాగించెను.

### 3. అత్రిమహర్షి వివాహము

కొంత కాలమునకు కర్దముడు దేవహుతిలకు శ్రీమన్నారాయణుని యొక్క కటాక్షములచే ఒక కుమారుడు, 9 మంది కుమార్తెలు జన్మించిరి. బ్రహ్మదేవుడు అందులో ఒకరు అయిన అనసూయను అత్రి మహర్షికి ఇచ్చి వివాహము చేయదలచి అత్రిమహర్షిని పిలిపించెను. అతని అంగీకారము పై కర్దముడు అనసూయను అత్రిమహర్షికి ఇచ్చి వివాహమును జరిపించెను. అటుపై అత్రిమహర్షి అనసూయను వివాహము చేసుకొన్న తరువాత గృహస్థాశ్రమమున తన ఆశ్రమమున తపోనిష్ఠతో కాలము గడుపుచుండెను. ఇలా ఒకరికొకరు అన్యోన్య దంపతులై సంసార సుఖములను పొందుతూ కాలము గడుపుచుండిరి[1].

### 4. త్రిమూర్తులు అనసూయకు వరములు ఒసగుట

అత్రిమహర్షి అనసూయ దంపతుల అన్యోన్యదాంపత్యమును పరీక్షింప ఒకనాడు త్రిమూర్తులైన బ్రహ్మవిష్ణుమహేశ్వరులు అత్రిమహర్షి ఆశ్రమమునకు వచ్చిరి. అత్రిమహర్షి ఆశ్రమమున ఆతిథ్యమును కోరిరి. ఈ ముగ్గురు అత్రిమహర్షితో తమకు ఆతిథ్యము ఇచ్చుటలో ఒక షరతును పెట్టిరి. అది ఏమనగా "తమకు భోజనము వడ్డించు స్త్రీ నగ్నముగ వడ్డింప వలె"నని చెప్పిరి. అంత అత్రిమహర్షి అనసూయకు చెప్పగ అనసూయ దానికి సరి అని అంగీకరించెను. త్రిమూర్తులు స్నానముచేసి వచ్చి కూర్చుండ వారిపై అనసూయ మంత్రాక్షతల జలమును చల్లగ వారు ముగ్గురును చంటిబిడ్డలు అయ్యిరి. ఆమె నగ్నమై వడ్డించి పిమ్మట వస్త్రమును ధరించి తిరిగి వారిపై జలము జల్లి యథా పూర్వముగ త్రిమూర్తులుగ చేసి భుజింపమని కోరెను.

---

1. మర్కండేయ పురాణము, భాగవతము, తృతీయస్కందము.

అటుపై వారు భుజించిన పిమ్మట వారి ముగ్గురిని శిశువులుగ చేసి ఉయ్యాలలో పరుండబెట్టి ఊచుచుండెను. ఇంతలో సరస్వతీ, పార్వతి, లక్ష్ములు తమ భర్తలను వెదుకుతూ వచ్చి అనసూయను పతిభిక్షను వేడిరి. అనసూయ వారిని ఆదరించి ఆ ముగ్గురు బిడ్డలను వారికి ఇచ్చెను. వారు ఆశ్చర్యపడి తమ భర్తలను తమకు తిరిగి ప్రసాదింపమని కోరిరి. అనసూయ ఆ త్రిమూర్తులకు మ్రొక్కి మంత్రాక్షతలతో ఆ బిడ్డలను త్రిమూర్తులను చేసి సరస్వతి, లక్ష్మి, పార్వతులకు ఇచ్చెను.

అటుపై త్రిమూర్తులు భార్యాసహితులై అనసూయ మహాత్మ్యమును మెచ్చుకొని తమ అంశములచే లోకోద్ధారకములగు ముగ్గురు పుత్రులు ఉదయింతురని వరమిచ్చి అనసూయ అత్రి మహర్షులను ఆశీర్వదించి తమ దారిన తాము వెళ్ళిరి. ఈ వృత్తాంతము మనకు భాగవతమునందు మార్కండేయ పురాణమున కలదు. మరొక పర్యాయము కౌశికపత్ని శాపమున సూర్యుడు ఉద యింప లేదు. లోకమున సూర్యుడు ఉదయింపక పోవుటచే దేవతలు బ్రహ్మ దేవుని ప్రార్థింపగ "ఈ కార్యమును సాధించుటకు పతివ్రత అయిన అనసూయ మాత్రమే సమర్థురాలని" బ్రహ్మదేవుడు దేవతలను ఆమె దగ్గరకు పంపెను. అనసూయ కౌశిక పత్నిని అంగీకరింప చేసి సూర్యోదయ మగునట్లు చేసెను. మరణించిన ఆమె భర్తను కూడా బ్రతికింపచేసెను. ఆమె గొప్ప పతివ్రతా శిరోమణి తత్త్వమును త్రిమూర్తులు మెచ్చుకొని ఆమెకు తమ అంశములతో కుమారుడు ఉదయించునని చెప్పిరి[1].

**5. అత్రిమహర్షి సంతానమునకై తపముచేయుట**

అత్రిమహర్షి భార్యాసహితుడై ఋక్షపర్వతమున దేవదేవుని గూర్చి శతవర్షములు గొప్ప తపస్సును చేసెను. ఆ తపో అగ్నిచే మూడు లోకములు

1. ఈ వృత్తాంతము మనకు మార్కండేయ పురాణమునందు కనబడును.

కలతపడగ త్రిమూర్తులయిన బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ప్రత్యక్షమయిరి. ఆ సమయమున అత్రి వారిని పూజించి "నేను సత్సంతానార్థమై దేవదేవుని గూర్చి తపముచేయుచుండగ మీరు ఎందులకు వచ్చితిరి అని అడిగెను. మీలో అధికులు ఎవరు?" అని ప్రశ్నించెను. అందులకు వారు తమలో తాము అందరూ సమానమేననిమాలో భేదము ఎవరికి లేదనియు త్వరలోనే మా ముగ్గురి అంశములచే సత్పుత్రుడు ఉదయించుననియు వరమిచ్చి వెళ్ళిపోయిరి.

### 6. అత్రిమహర్షికి లోకోత్తర పురుషుడు ఉదయించుట

కాలక్రమమున త్రిమూర్తుల వరమున అత్రిమహర్షి నేత్ర గోళముల నుండి చంద్రుడును, అనసూయ గర్భమున దత్తాత్రేయుడును, దుర్వాసుడును క్రమముగ బ్రహ్మవిష్ణుమహేశ్వరుల అంశములచే పుట్టిరి. అటుపై కాలక్రమమున బిడ్డలు పెరుగుచుండగ ఒకానొకనాడు ధ్యాన నిమగ్నుడైన అత్రిమహర్షి అనసూయను పిలిచి "ఓ సాధ్వీమణీ! నీవు కోరినట్లుగనే నీకు కుమారులు జన్మించిరి. నేనిక తపోజీవనమునకు అభిలషించు చున్నాను. నీవు నాతో ఉందువా లేక ఈ బిడ్డల దగ్గర ఉందువా" అని ప్రశ్నించెను.

అంత అనసూయ తన భర్తతో "ఓ మహాత్మా! ఈ పుత్రులు ఇంకను పెరిగి పెద్దకాలేదు. కావున ఇప్పుడే ఆశ్రమమును వదలి తపో జీవనమునకు వెళ్ళుట ధర్మముకాదు. అందువలన పుత్ర పోషణార్థమై పృథుచక్రవర్తి వద్దకు వెళ్ళి ధనమును తీసుకొనిరండి. వారిని పెంచి పెద్దచేసిన పిమ్మట మనము వానప్రస్థాశ్రమమునకు వెళ్ళెదము, ఇది నా అభిప్రాయము. అయినను మీ ఇష్టానుసారమే కానిమ్ము"అని పలికెను. ఆమె మాటలను వినిన అత్రి మహర్షి అందలి ధర్మసత్యములను గుర్తించి ఆమె ఇచ్చిన సూచనల మేరకే ధనార్థియై పృథుచక్రవర్తి చేయు చున్న అశ్వమేధయాగమును చూచుటకు వెళ్ళెను.

## 7. అత్రిమహర్షి పృథుచక్రవర్తి వద్దకు వెళ్ళుట

పృథు చక్రవర్తి యాగ అశ్వమును వదలి తత్సంరక్షణకై పుత్రుని కూడ పంపుచూ అతనికి సహాయముగ అత్రిమహర్షిని వెళ్ళమని ప్రార్థించెను. అత్రికూడా అతని మాటను అంగీకరించి అట్లే చేసెను.

కాని ఇంతలో పృథుచక్రవర్తి యాగవైభవమును చూడలేక ఇంద్రుడు పాషాండవేషమున తిరోహితుడై యాగాశ్వమును అపహరించి ఆకాశమునకు వెళ్ళెను. ఆ సమయమున పృథుచక్రవర్తి యొక్క కుమారుడు దేవేంద్రునిపై బాణము వేయుటకు సంశయించుచుండగ వెంటనే అత్రిమహర్షి యజ్ఞము చేయునపుడు దానిని దిక్కరించు యజ్ఞ హంతకుడు ఎంతటి వాడయినను చంపవచ్చునని పృథుచక్రవర్తి కుమారునకు బోధింపగ అతడు ఇంద్రునిపై బాణములు వేయగ అతని ధాటికి తట్టుకొనలేక ఇంద్రుడు గుర్రమును వదిలి వెళ్ళిపోయెను. ఇంతలో తిరిగి రాజకుమారుడు అత్రిసహితుడుగ గుర్రమును తీసుకువచ్చుచుండగ ఇంద్రుడు మరల అపహరించెను. కాని ఇది పృథుచక్రవర్తి కుమారునకు అర్థముకాలేదు. వెంటనే అత్రిమహర్షి తన దివ్యదృష్టితో చూచి ఆ బాలునకు చెప్పగ వెంటనే ఇంద్రుని తరిమి యాగ అశ్వమును ఆ బాలుడు తీసుకొని వచ్చెను. అటుపై అశ్వమేధ యాగమును నిర్విఘ్నముగ పృథుచక్రవర్తి కావించెను. యాగ అనంతరము పృథుచక్రవర్తి బ్రాహ్మణులకు అనేక దక్షిణలను ఇచ్చెను. ఇంతలో పృథు చక్రవర్తి అత్రిమహర్షి చేసిన సహాయమునకు అతనిని అనేక విధముల కీర్తించెను. అంత ఆ మాటలను విన్న గౌతమమహర్షి అసూయపరుడై 'ఒక మానవమాత్రుని ఇంతలా కీర్తించవలెనా' అని వాదమునకు దిగెను. అంత కశ్యప మహర్షి లేచి ఈ సమస్యను సనత్కుమారుడు తప్ప ఎవరూ తేల్చలేరని వక్కాణించెను. ఇలా వాదోపవాదములతో సదస్సులోని అందరినితోడ్కొని అత్రి, గౌతములు ఇరువురును సనత్కుమారుని వద్దకు వెళ్ళి వాదమును వినిపించిరి.

అంత వాదమును విన్న సనత్కుమారుడు అత్రి వాక్యము లందు దోషములేదనియు 'నా విష్ణుః పృథివీపతిః' అను భావమున అవి ధర్మ యుక్తములేననియు తీర్మానించెను. అంత సదస్యులందరును పృథు చక్రవర్తితో సనత్కుమారుని తీర్పును చెప్పగ ఆతడు అత్రిమహర్షిని కీర్తించి అనేక ధన కనక వస్తు వాహనములను ఇచ్చి సత్కరించెను. ఇలా అనసూయ చెప్పినట్లుగ ధనసంపదను పొందిన అత్రిమహర్షి ఆ ధనమును కుమారులకు పంచియిచ్చి అటుపై వారు పెరిగిపెద్ద కాగ అత్రిమహర్షి భార్యా సహితుడై ధర్మసంహిత బుద్ధితో వనమునకు వెళ్లెను[1].

## 8. అత్రిమహర్షి సూర్యచంద్రులను రక్షించి రాక్షసులను భస్మము చేయుట

ఒకానొక సమయమున దేవతలకు జంభాదిరాక్షసులకు పెద్ద యుద్ధము సంభవించెను. ఆ సమయమున రాహువు యొక్క బాణముచే సూర్యచంద్రుల సోలిపోగ వెలుగు నశించెను. అటుపై లోకమంతయు గాఢాందకారమయ్యెను. రాక్షసులు విజృంభించి దేవతలను కష్టబెట్ట చూచిరి. అటువంటి సమయమున దేవతలు భయపడి అత్రిమహర్షిని శరణుజొచ్చిరి. అటుపై అత్రిమహర్షి దేవతలకు అభయమిచ్చి సూర్యచంద్రుల ఇరువురిని నక్షత్రములుగ చేసిరి. అత్రి మహర్షి తన తీక్ష్ణమైన దృష్టిచే ఆ రాక్షసులు చనిపోవునట్లు చేసెను. ఆ సమయమున అత్రిమహర్షియొక్క గొప్ప దనమును చూచి దేవతలు మిగుల ఆనంద చకితులు అయిరి. ఈ వృత్తాంతము మనకు బ్రహ్మాండ పురాణమున కలదు.

## 9. అత్రిమహర్షి సీతారాములకు ఆతిథ్యమిచ్చుట

భరతుడు సపరివారుడై అరణ్యముననున్న సీతారామ లక్ష్మణుల దగ్గరకు చేరి శ్రీరాముని పాదుకలను తీసుకొని నంది గ్రామమునకు వెళ్ళెను.

---

1. ఈ వృత్తాంతము మనకు భారత అరణ్య పర్వమున కలదు.

పిదప శ్రీరాముడు సీతాలక్ష్మణ సమేతుడై అత్రి మహర్షి ఆశ్రమమునకు వచ్చెను. అత్రిమహర్షి వారిని మిగుల గౌరవించి అనసూయాదేవి మాహాత్మ్యమును వారికి తెలిపెను. అటుపై సీతాదేవి అనసూయ వలన పతివ్రత ధర్మములను విని ఆమెకు తమ వివాహ వృత్తాంతమును తెలిపెను. అటుపై అనసూయ సీతాదేవికి క్రొత్తవస్త్రములను, ఆభరణము లను, శశ్వదలంకృత కుంకుమను ఇచ్చి ఆశీర్వదించెను. ఆ రాత్రి సీతారామ లక్ష్మణులు అత్రిమహర్షి ఆశ్రమమున గడిపి మరునాడు ఉదయమున బయలుదేరి వెళ్లిరి[1].

### 10. అత్రిమహర్షి అపరిగ్రహవ్రత పాలనము

అత్రిమహర్షి కొంతకాలము కాశ్యప విశ్వామిత్రాదులతో కలిసి భూమిపై చరించుచూ తపో నిష్టలో ఉండెను. ఇలా ఉండగా ఒకానొక సమయమున లోకమున గొప్ప క్షామము ఏర్పడెను. ప్రతిగ్రహము చేయమని వ్రతము ధరించిన సప్తర్షులు ఆకలి తీర్చుకొనుటకై ఒక శవమును తిన ప్రయత్నించిరి. ఇంతలో వారివద్దకు 'వృషాదర్భి' అను రాజు వచ్చి భోజన పదార్థములను పంపెదనని చెప్పెను. కాని వారు నిరాకరించిరి. అయినను అతడు రహస్యముగ భోజన పదార్థములు పంపెను. అయినను వారు గ్రహించలేదు. ఇలా ఉండగా వారు కొంతకాలము తామరతూండ్లు తిని బ్రతుకనెంచి ఒక కొలనుకు వెళ్ళి కొన్ని బిస నాళములను కోసుకొని కట్ట గట్టి గట్టుపైపెట్టి కొలనిలో స్నానముచేసి వచ్చుసరికి దేవేంద్రుడు మాయా వేషధారుడై ఆ తామరతూండ్లను దాచివేసెను.

ఇంతలో సప్తర్షులు ఆ తామరతూండ్లను అపహరించిన వారికి కలిగెడి దోషములను గూర్చి నిర్వచింప తొడగిరి. వారి విషయమును

---

1. ఈ విషయము మనకు రామాయణమునందు కలదు.

గుర్తించిన ఇంద్రుడు వారి అపరిగ్రహమునకు, వ్రతపాలనకు, తపః ప్రధాన జీవితమునకు మెచ్చుకొని ప్రత్యక్ష స్వరూపుడై మహర్షులతో పాటు అత్రిమహర్షిని కూడ స్వర్గలోకమునకు తీసుకువెళ్ళి అనేక విధముల పూజించి కృతార్థుడయ్యెను[1].

**అత్రి సంహిత**

ధర్మ పరాయణులగు ఋషులు అత్రిమహర్షిని దర్శించి "ఓ మహాత్మా! నీవు విశ్వ విదుడవు, ఋషి శ్రేష్ఠుడవు, విశ్వ హితమును కోరు వాడవు, కావున మాయందు దయఉంచి దైవములలో ఉత్తమ దైవము ఎవరు, ఏది పరమ ధర్మము, ఏది పరమ విధి, పరమేశ్వరుని పూజించు విధి ఏది ఈ సందేహములను తీర్చమనిరి". అంత వారిమాటలను విన్న అత్రిమహర్షి "ఓ ఋషులారా! సర్వదేవతలలోను శ్రీమన్నారాయణుడే ఉత్తమోత్తమ దైవము. అతడే పరంధాముడు పరంజ్యోతి సర్వకారణకారుడు. ఉపవాస, వ్రత, దాన, స్వాధ్యాయము మొదలగు వానితో అతనిని అర్చించు టయే పరమ విధి" అని చెప్పెను. అందుకే 'సర్వదేవ నమస్కారం కేశవం ప్రతి గచ్ఛతి' అని అంటారు. ఇహలోకసుఖములకు అతనిని అర్చావ తారముగ పూజించుటలో అమూర్తార్చనము, సమూర్తార్చనము అని రెండు విధములు కలవు. 'అగ్ని ఆహుతి' అమూర్తార్చనమనియు, 'ప్రతిమా ద్యర్చనము' సమూర్తార్చన మనియు తెలియవలయును.

వైఖానసమతము అనుసరించిన అర్చనయే ఉత్తమము. సాయం సంధ్యలయందుగాని ప్రాతః సంధ్యలయందు గాని గృహముల యందు గాని దేవాలయములయందు గాని బ్రాహ్మణులు భక్తి భావములతో అగ్నిహోత్రాది హోమాంతముగ పరమేశ్వర ప్రతిమను పూజించుటయే

1. ఈ విషయము భారతములో అనుశాసనిక పర్వమునందు కలదు.

సమూర్తార్చనము. భృగుడు, కశ్యపుడు, మరీచి మరియు నేను దీనిని అభినందింతుము అని అత్రిమహర్షి ఆమూలాగ్రముగ ఉపదేశించెను. దీనికే 'అత్రిసంహిత' అని పేరు.

ఈ అత్రి సంహిత ఆరు విధములుగ చెప్పబడినది. 1. కర్మ 2. ప్రతిష్ఠ 3. పూజనము 4. స్నపనము 5. ఉత్సవము 6. ప్రాయశ్చిత్తము. ఈ ఆరు భాగములలో ఏయే విషయములు విపులీకరించబడినవి అనగా మొదటి భాగమున దేవాలయ స్థలపరిశీలనము, దేవాయతన రూపము, దైవ ప్రతిమా నిరూపణము చెప్పబడినవి. రెండవ భాగమున ప్రధాన పరివార దేవతా ప్రతిష్ఠాదికము చెప్పబడినది. మూడవ భాగమున పూజావిధానము చెప్పబడినది. నాల్గవ భాగమున అభిషేకాది విషయము చెప్పబడినది. ఐదవ భాగమున ఉత్సవ విశేషములు, ప్రత్యేక ఉత్సవములు, బంధ నములు చెప్పబడినవి. ఆరవభాగమున పూర్వోక్త విధానములందలి దోషాది కముల ప్రాయశ్చిత్తములు వివరింపబడినవి.

**అత్రిస్మృతి**

అత్రిస్మృతి లేక ఆత్రేయ ధర్మశాస్త్రమను పేరున అత్రిమహర్షి ప్రోక్తమగు ధర్మశాస్త్రము కలదు. విప్రుడు శూద్రస్త్రీని వివాహమాడినచో పతితుడే అని అత్రిమహర్షి పేర్కొన్నట్టు మనుస్మృతి (3-16) లో కలదు. దీనిలో తొమ్మిది అధ్యాయములు ఉన్నాయి - దాన ధర్మములు, జపతములు, రహస్య ప్రాయశ్చిత్తములు, యోగములు, యోగాంగములు మొదలగునవి కలవు.

ఇంకను అత్రిసంహితలు, అత్రిస్మృతులను పేర ఎన్నియో స్మృతి గ్రంథములు కనబడుచున్నవి. వీనియందు ప్రాయశ్చిత్తములు, దానములు, పితృమేధము, ఆచారములును, గురుప్రశంస, చాతుర్వర్ణ ధర్మములు, జపమాల పవిత్రత, బ్రాహ్మణులకు ఉండవలసిన శౌచాది సుగుణములు,

ఇష్టాపూర్తనిర్వచనము, యమనియమములు, పుత్రులు, దత్తపుత్రులు, ప్రాయశ్చిత్తములు, అశౌచము, చాంద్రాయణ కృచ్ఛ శాంత పనములు మొదలగు విషయములు కలవు.

దత్తపుత్ర స్వీకృతి విషయమున అత్రి (యనుశాసనమే) మొట్ట మొదటిదని దత్తకమీమాంసలో కలదు. అత్రిని అనుసరించి అంత్యజులు ఏడు జాతులవారు రజకులు, పాదరక్షలు తయారు చేయువారు, నటకులు, బురుదులు, కైవర్తకులు (పల్లెవారు), మేదరులు, భిల్లులు. కాని యాత్రా, వివాహ, యజ్ఞాదులలో తాకరాని వారను విషయమున పట్టింపులేదు. మరియు లఘ్వత్రిస్మృతి, వృద్ధాత్రేయస్మృతి అని రెండు స్మృతులు అత్రి మహర్షి పేరున కనబడుచున్నవి.

### అత్రిమహర్షి స్తుతి

"బ్రహ్మమానస పుత్రా! బ్రహ్మజ్ఞాన తేజో విశాలా! దత్తాత్రేయ ఋషితంత్రీ!
బ్రహ్మాండలోక వినుతా!అనసూయ పతే! దూర్వాస జనకా!అత్రి ఋషే!
బ్రహ్మాది దేవతాది వినుతా! సూర్యచంద్ర రక్షకా! అత్రి సంహిత ప్రోక్తా!
బ్రహ్మాండాది పరివేష్టిత విష్ణ్వంశ సీతారామ పూజితా! నమస్తే నమః!"

ఌ ❖❖ ❖ ఴ

# 3. అష్టావక్రమహర్షి

పూర్వము ఏకపాదుడను సద్బ్రాహ్మణుడు ఎప్పుడూ తపస్సులో ఉండేవాడు. అతనికి సుజాత అను పత్నికలదు. ఇతని వద్ద బ్రహ్మచారులెంతోమంది వేదవిద్యను అభ్యసించేవారు. ఏకపాదుడు తన అంతేవాసులకు తపస్సులోని ఒక అంగ భాగముగ ఎల్లవేళల వేదపనసలను వల్లింప చేయుచుండెడివాడు.

## 1. ఏకపాదుడు అష్టావక్రుని శపించుట

సుజాత ఏకపాదుడు అన్యోన్య దంపతులై కాలము గడుపు చుండగ సుజాత భగవత్కటాక్షముచే గర్భమును ధరించెను. ఏకపాదుడు ఎల్లప్పుడు శిష్యులకు వేద అధ్యయనమును గావించుచుండగా పుణ్యవిశేషముచే సుజాత గర్భమున ఉన్న బాలునికి వేదములు అలవడెను.

ఇలా ఉండగా ఒకానొకనాడు ఏకపాదుడు శిష్యులకు వేదమును నేర్పించుచుండగ మాతృగర్భములో ఉన్న బాలునకు పూర్వపుణ్య వశమున వేదములు అలవడిన జ్ఞానము కలిగి మాతృగర్భము నుండియే స్వరము తప్పినదని తండ్రికి చెప్పెను. అలాగే మరియొక పర్యాయము ఇలా అనెను. "నిద్రాహారములైనను లేకుండ శిష్యులు ఎల్లప్పుడూ చదివించెదవు ఏల? మాతృ గర్భమునుండి ఒకసారి వినినసే నాకు వేదములు వచ్చినవి. వారిని ఇంతగా బాధించు చుండెదవు ఏల?" అని తండ్రిని అడిగెను. అంత ఏకపాదుడు తనకు జన్మించు కుమారుడు దివ్య మహిమోపేతుడు అని గ్రహించి ఆనందించెను. కాని ఇంత బాల్యములోనే తండ్రిని తప్పుపట్టుట మంచిది కాదు. అధ్యయనము గురించి వక్రముగా పల్కుట శిక్షార్హములే

కాని క్షమించతగినవి కాదు. శిక్షింపవలసి వచ్చినప్పుడు పుత్రభావము అడ్డురాదా! రాకూడదని తలంచి అతనిని ఇలా శపించెను. ఎనిమిది వంకర్లుగ పుట్టుదువని శపించెను. అటుపై ఆ బాలుడు అగ్నికల్పుడై తల్లి కడుపున పెరుగుచుండెను.

## 2. ఏకపాదుడు జలమజ్జితుడగుట

ఒకానొకనాడు ఏకపాదుని భార్యయైన సుజాత ప్రసవ భారమునకు భయపడి ఘృత, తైల, ధాన్యములను తెమ్మని చెప్పెను. ఏకపాదుడు అట్లే అని ధనార్థియై జనకచక్రవర్తి వద్దకు పోయెను. అప్పుడు జనకచక్రవర్తి వరుణ పుత్రుడగు వందితో వాదన చేసి గెలిచిన వారికి సమస్తము ఇచ్చెద ననియు ఓడినవారు జలమజ్జితులై ఉండ వలయుననియు ఆజ్ఞాపించెను. ఏకపాదుడు విజయ కాంక్షయై వందితో వాదమునకుదిగి ఓడిపోయి జల మజ్జితుడై యుండెను.

## 3. అష్టావక్రుడుదయించి తండ్రిని రక్షించుట

ఇలా ఉండగా సుజాత ఇంటివద్ద పుత్రుని ప్రసవించెను. ఆ పుత్రుడు తండ్రి శాపవశమున ఎనిమిది వంకర్లతో పుట్టి 'అష్టావక్రుడు' అను పేరుపొందెను. ఆ సమయముననే సుజాత తల్లికూడా (ఉద్దాలకుని భార్య) ఒక పుత్రుని కనెను. అతడు 'శ్వేతకేతుడు' అను నామమున పెరుగు చుండెను. అష్టావక్రుడు, శ్వేతకేతుడు ఉద్దాలకుని వద్ద ఏక సంధా గ్రహులై చదివి అధ్యయన శూరులైరి. అటుపై తాతయగు ఉద్దాలకుని వద్ద మేనమామ యగు శ్వేతకేతుడు, తాను విద్యనభ్యసించుచున్నప్పటికి తెలియక తాతయగు ఉద్దాలకుడే తన తండ్రిఅని శ్వేతకేతుడు అన్నయని తలంచు చుండెను. ఒకనాడు శ్వేతకేతుడు అష్టావక్రుని 'మీ తండ్రికడకు పొమ్మని' కసరెను. ఆ విధంగా అవమానింపబడి తల్లియగు సుజాత దగ్గరకు వెళ్ళి అష్టావక్రుడు తన తండ్రి సంగతి చెప్పమనెను. అప్పుడు సుజాత "ఏకపాదుడు

జననృపాల నగరమునకు వెళ్ళి వందితోడి వాదమున ఓడి జలమజ్జితు డయ్యెను" అని తెల్పెను.

అష్టావక్రుడు తన తండ్రిని రక్షింప నిశ్చయించి తన మేనమామయగు శ్వేతకేతునితో జనకమహారాజు వద్దకు పోవ ప్రయత్నించెను. కాని జనకమహారాజు ఆస్థానమునగల ద్వారపాలకులు వారిని లోపలకు రానివ్వక అడ్డగించెను. ద్వారపాలకుడు వృద్ధులు మాత్రమే లోపలకు వెళ్ళవలెను. మీరు వెళ్ళరాదని నివారించెను. అంత అష్టావక్రుడు జ్ఞానములో బాలుడైనను వృద్ధునితో సమానమే కాని వయస్సు మీరినవాడు కాదని వాదించి చెప్పుచూ కొన్ని శాస్త్ర విషయములనుకూడా వివరించెను. అవి ఈక్రింది విధముగ ఉండెను. "అంధుని త్రోవకును, బధిరుని మార్గమునకును, స్త్రీ పథము నకును, రాజు వర్త్మమునకును, బ్రాహ్మణుని యధ్వమునకును ప్రతిబంధ కము కలిగింపరాదని" ద్వారపాలకునికి తెల్పెను. ఆ ద్వారపాలకుడు అతని శక్తిసామర్థ్యాలకు ఆశ్చర్యపడి ప్రవేశమును ఇచ్చెను.

అటుపై అష్టావక్రుడు జనకమహారాజు వద్దకు పోయి నేను వందితో వాదించెదనని పల్కెను. కాని ఆ మాటలను విన్న జనకమహారాజు "నీ వంటి వాడా వందిని గెలచుట" అని ఎగతాళి చేసెను. కాని అష్టావక్రుడు జనకునితో వాదనను చేసి తన శక్తిని చాటుకొనెను. జనకుడు ఆశ్చర్యపోయి వందితో వాదించుటకు అజ్ఞ ఇచ్చెను.

బ్రాహ్మణశ్రేష్ఠుల నడుమ అష్టావక్రుడు వందితో వాదమునకు దిగెను. వారిద్దరి సంభాషణ ఇలా జరిగినది. మొట్టమొదటగా వంది - అగ్ని ఒక్కడే ప్రజ్వలించును, సూర్యుడు ఒక్కడే ప్రకాశించును, శివుడు ఒక్కడే సర్వవ్యాపి అని పలికెను. అష్టావక్రుడు - ఇంద్రాగ్నులిద్దరు మిత్రులు, నారద పర్వతులిద్దరు దేవర్షులు, ఆశ్వినేయులిద్దరు రూపవంతులు, భార్యభర్తలిద్దరు సంసారమునకు మూలములని పై విధముగ 12 సార్లు

ఇద్దరు సమానముగ వాదించుకొనిరి. అటుపై చివరిలో అష్టావక్రుడు తన గట్టివాదనతో వందిని ఓడించెను. ఆ దృశ్యమును చూచిన జనక మహారాజు అష్టావక్రుని అభినందించి తనకు ఏమి కావలయునో కోరుకోమని ఆజ్ఞాపించెను. అష్టావక్రుడు తన తండ్రియగు ఏకపాదుని అలాగే జలమజ్జితులైన బ్రాహ్మణులను విడిపించి, తన తండ్రితో వాదించిన వందిని జలమజ్జితుడను చేయమనెను.

అటుపై వంది తన తండ్రియగు వరుణదేవుని యజ్ఞ కారణమున బ్రాహ్మణప్రవరులను అచటికి పంపితినే కాని వారిని బాధించుటకు కాదని చెప్పి అష్టావక్రుని అభినందించి వెడలిపోయెను. ఆనాటి నుండి అష్టావక్రుని కీర్తి అనెడి వెన్నెల లోకమంతయు వ్యాపించెను. అటుపై జనకచక్రవర్తి అష్టావక్రుని, అతని తండ్రియగు ఏకపాదుని మిక్కిలి పూజించి అద్వైతవేదాంత రహస్యములను గ్రహించెను. ఈ అష్టావక్రుడు జనకుల సంవాదమే 'అష్టావక్ర సంహితయై' అద్వైత వేదాంత రహస్యములను అద్భుతముగ వెల్లడించుచున్నది.

**4. అష్టావక్రుడు నిర్వక్రుడై సుందరుడగుట**

ఏకపాదుడు కుమారుని గొప్పదనమునకు, పితృభక్తికిని సంతసించి అష్టావక్రుని చూచి "నాయనా ! నీ అంగవైకల్యమునకు కారణము నేను, నీ పితృభక్తి పాండిత్యమునకు సంతసించితిని. నీవు వెంటనే పోయి 'సమంగ' నదియందు సుస్నాతుడై రమ్మని" చెప్పెను. అష్టావక్రుడు వెంటనే 'సమంగ' నదీజలమున స్నానమాడగనే తన దేహమందలి అని వంకర్లు పోయి సుందరరూపుడుగ మారెను. తన తండ్రియొక్క తపోమహిమకు ఆనంద చకితుడయ్యెను. అటుపై పూజ్యులైన తన తల్లిదండ్రులను పోషించుచూ గొప్పదైన తపోవృత్తిలో ఉండెను[1].

1. ఈ వృత్తాంతము భారతమున వనపర్వమున (అరణ్య పర్వమున) కలదు.

## 5. అష్టావక్రుని వివాహ వృత్తాంతము

ఏక పొదుడు తన కుమారుని పిలిచి "నాయనా! నువ్వు సద్విద్య లోను, బ్రహ్మచర్యఆశ్రమ నిర్వహణలోను గొప్ప యశస్సును పొందితివి. ఇకపై నీవు గృహస్థాశ్రమమును స్వీకరించి ఉత్తమ గార్హస్థ్యధర్మమున నాకును నీ తల్లికిని సంతోషమును చేకూర్చుము" అని చెప్పెను. అటుపై తండ్రి ఆజ్ఞను శిరసా వహించిన అష్టావక్రుడు వదాన్య మహర్షి కుమార్తెయగు 'సుప్రభ' ను వివాహము చేసికొనదలచి అతని ఆశ్రమమునకు పోయెను. అంత వదాన్యుడు అతని కోరికను తెలుసుకొని తన కుమార్తెను అతనికి ఇచ్చుటకు ముందుగ ఒక పరీక్షను పెట్టెను. అది ఏమనగ - అతడు ఉత్తర దిశకు పోయి కుబేరుని నగరమైన అలకా పట్టణమును దాటి హిమగిరి యందున్న పార్వతీ, పరమేశ్వరులను పూజించి, మరియు ఉత్తరదిశకు వెళ్ళి అక్కడ మంచి రంగులతో నిర్మించబడిన సౌధములో నున్న రమణిని చూచి ఆమె ఆశీర్వాదమును పొందవలెనని చెప్పెను. అందులకు అష్టావక్రుడు అంగీకరించి ఆ కార్య నిమగ్నుడయ్యెను.

ఈ విధముగ ప్రయాణమైన అష్టావక్రుడు మనస్సును పరమేశ్వరుని పాదములపై ధ్యానమొనర్చుచు బాహుదా నదిని చూచి అక్కడ స్నానము చేసి ఒక దినము గడిపి అటుపై కుబేరుని నగరమైన అలకాపురి పట్టణము నకు పయనమయ్యెను. అతని రాకను గమనించిన కుబేరుడు అతనిని పుష్పక విమానమున కూర్చుండబెట్టి తన పట్టణమునకు తీసుకువెళ్ళి అతనికి సత్కారము చేయ బంగారు మేడను విడిదిగ ఇచ్చి రంభ మొదలైన అప్సరసలను సేవకరాండ్రులుగ ఏర్పరచెను. వారు ప్రతిరోజును నృత్యగీత వాద్యములతో అతనిని ఆనందింపచేయు చుండిరి. కాని అష్టావక్రుడు వారు ఏమి చేసినను వారిపై మోహపడని వాడై ఒక సంవత్సరకాలము అక్కడ గడిపెను. అంత అతనిని పలు విధముల కీర్తించి కుబేరుడు వీడ్కోలు పలికెను.

అటుపై వదాన్యుడు తనకు పెట్టిన పరీక్షగుర్తించి అటునుంచి అలకాపురమునుండి హిమాలయ సమీపమునకు పోయి అక్కడ కనబడిన మహర్షులకు నమస్కరించి ఆనంద ఉత్సాహభరితుడై హిమ వత్పర్వతమును అధిష్ఠించెను. అక్కడ పార్వతీపరమేశ్వరులకు ప్రమధగణములకు పలు విధముల పూజలనుసల్పి సర్వేశ్వర స్తోత్రముతో అక్కడ కొంతకాలము గడిపెను. అటుపై అష్టావక్రుడు ఉత్తరదిశగా వెళ్ళగ అక్కడ వదాన్యుడు చెప్పిన కడిమిలేమ్రాకుల వనము కనబడెను. అందు ఆతడు ప్రవేశింపగనే దివ్యసుందరీమణులతో కూడిన ఒక బంగారు మేడను చూచెను. అందు లోనికి ప్రవేశించి అక్కడ కనబడిన అందగత్తెలను చూచి వారికి వశముగాక మీ రాణిని చూపుడని పలికెను. అటుపై వారు మేడలోపలి భాగమునకు కొని పోయి ఒక అత్యద్భుతమైన సౌందర్య రాశియగు ఒక కన్యను చూపిరి. ఆమె అనంత విలాస హాసములతో అష్టావక్రుని స్వాగతించి అర్ఘ్యపార్ఘ్యాదు లను ఒసగెను.

అటుపై రాత్రి సమయము కాగ అతనికి ఇష్టమైన భోజన పదార్థము లతో సంతృప్తునిచేసి అతను నిదురించు సమయమున, ఆతని శయ్యచేరి అతనిని లైంగికముగ కలుసుకొన ప్రయత్నింప చేసెను. కాని అతడు నిరాకరించి నేను అస్కలిత బ్రహ్మచారిననియు పరసతిని అపేక్షించుట పాపహేతువనియు చెప్పెను. కాని మరునాడు మరల అతనికి అభ్యంగ స్నానాదులను గావించి షడ్రసోపేతముగ అతనికి అధిక ఆదరమున విందు చేసెను. వాటినన్నింటిని స్వీకరించెను కాని తిరిగి ఆ రాత్రి తనను కలయ ప్రయత్నించి బలవంతముచేయగ ఆమె ఎన్ని చెప్పినను వినక ఇలా పలికెను.

"స్త్రీలకు ఎప్పుడును స్వాతంత్ర్యము లేదు. బాల్యమున తండ్రి, యవ్వనమున భర్త, వార్థక్యమున కుమారుడు రక్షించునే కాని స్త్రీ ఎన్నడు స్వాతంత్రించి ఏ కార్యమును చెయ్యరాదని" ఉపదేశించెను. ఆమె మన్మధ

బాధ వివరణ చేయుచు ఎంత ప్రలోభపెట్టినను అష్టావక్రుడు ఏమాత్రమును చలించక అస్ఖలిత బ్రహ్మచారిగనేఉండెను. చివరకు అష్టావక్రుని యొక్క ఇంద్రియ నిగ్రహమునకు సంతసించి ఆతనిని చూచి ఇలా చెప్పెను "నేను ఉత్తరదిశాంగనను. నిన్ను పరీక్షింప వదాన్యుని ప్రార్థనమున ఇట్లు ప్రవర్తించి తిని. కాని ఈ పరీక్షలో నివే నెగ్గితివి. కావున ఇటనుండి పయనమైవెళ్ళి వదాన్యుడి కుమార్తెయగు 'సుప్రభ' అను కన్యను వివాహమాడి గృహస్థాశ్రమమును స్వీకరించుము". అలా ఉత్తరదిశాంగ అతనిని ఆశీర్వదించి పంపెను.ఈ విషయమునంతటిని అష్టావక్రుడు వదాన్యుడికి వినిపించెను. వదాన్యుడు ఆనందించి సరియైన ముహూర్తమును నిర్ణయించి తన కుమార్తెను అష్టావక్రునికి వివాహముచేయ తలంచెను. వీరి వివాహమును అష్టదిక్పాలకులు, దేవతలు, కిన్నెరలు, బ్రహ్మర్షులు అనందముతో తిలకించి ఆశీర్వదించిరి. అటుపై అష్టావక్రుడు సుప్రభా సహితుడై ఆశ్రమమునకు వెళ్ళి తపోవృత్తితో కాలము గడుపుచుండెను.

### 6 అష్టావక్రుడు రంభాదులను శపించుట

అష్టావక్రమహర్షి గృహస్థాశ్రమమున సంతోషముగ కాలము గడుపుతూ తన భార్యయగు సుప్రభ ద్వారా మంచి పుత్రులను పొందెను. అటుపై ఆతడు జలమధ్యమున ఘోరతపస్సును చేయుచుండెను. ఇలా ఉండగా ఒకనాడు రంభ మొదలైన అప్సరసలు అతని వద్దకు వచ్చి నమస్కరించక మీరు ఏల వచ్చితిరని వారిని ప్రశ్నించెను. అంత వారు తమ నృత్యగీతములను ఒకసారి తమకు చూపి మెప్పు పొందుటకు ఇట్లు వచ్చితిమని చెప్పితిరి. అటులైన ప్రదర్శింపుడని వారికి ఆజ్ఞ చేయుచూ తాను నీటిలోనే కూర్చొనెను. అంతవారు అత్యద్భుతముగ తమ నాట్యనైపుణ్యమును చూపగ అందులకు అష్టావక్రుడు మీకు ఏమి కావలయునోయని కోరుకొనమనగ, అంత వారు విష్ణుమూర్తితో సంభోగము కావలెనని కోరెను.

అంత అష్టావక్రుడు ఆలోచించి "శ్రీమహావిష్ణువు కృష్ణావతారము దాల్చినపుడు మీరు గోపికలై జన్మించెదరు. అప్పుడు మీకోరికలు సిద్ధింప గలవు" అని చెప్పి తాను జలమునుండి బయటకువచ్చెను. ఆ సమయమున రంభాదులు అతని ఆకారమును చూచి హేళనగా నవ్విరి. అంత అష్టావక్రుడు కోపించి "మీ కోరిక సిద్ధింప వరమిచ్చిన నన్ను చూచియే నవ్వితిరి. కావున మీరు శ్రీకృష్ణుని పరోక్షమున బోయవాండ్రచే చుట్టుముట్టబడి ఘోర అవమానములను పొందుదురుగాక" అని శపించి ఆశ్రమమునకు వెళ్ళెను[1].

## 7.అష్టావక్రుడు భగీరథుని దీవించుట

అష్టావక్రమహర్షి ఘోరతపస్సుచేయుట వలన అలసత్త్వముచే దేహ జవసత్త్వములను కోల్పోయి అస్థిపంజరము మాత్రము మిగిలినదా అన్నట్లు ఉండెను. ఈ స్థితిలో ఒకానొకనాడు మిక్కిలి బలహీనుడై అష్టావక్రుడు ఒకచోటికి పోవుచుండగా దారిలో భగీరథుడు కనిపించెను. ఇక్కడ మనకు ఇంచుక భగీరథుని జన్మ వృత్తాంతమును గురించి సూక్ష్మీకరించుకొనవలెను. ఒకానొక సమయమున సగర పుత్రులు కపిల మహర్షి కనులమంటలచే భస్మీభూతులు కాగ వారి భార్యలు నారాయణుని ఆరాధించి "వంశోద్ధారకుడగు మంచి పుత్రుని ఇవ్వకుండగనే భర్తలు చనిపోయిరి. కావున ఇక మాగతి ఏమి?" అని నారాయణుని అడిగిరి. అందులకు నారాయణుడు "ఓ కాంతలారా! మీరు భర్తృవిహీనలు అయినను వైధవ్యదోషము మీకు కలుగ కుండునట్లు అనుగ్రహించితిని. మీకు ఉత్తమోత్తమములగు కుమారులు ఉదయించెదరు". అని ఒక ఉపాయమును చెప్పి మాయమయ్యెను. విష్ణుమూర్తి చెప్పిన ఆ ఉపాయము మేరకు ప్రవర్తించగ వారికి భగీరథుడు జన్మించెను.

---

1.. ఈ వృత్తాంతము విష్ణుపురాణమునందు కలదు.

కాని అతడు శుక్రము లేకయే జన్మించుటవలన బాల్యము నుండే అర్భకుడై (బాలుడై) పడుచూలేచుచూ ఉండెడివాడు. ఈ భగీరథుని కాంచి అష్టావక్రుడు తన క్షీణించిన శరీరమును చూసి హేళన చేయుచున్నాడని భావించెను. కాని స్థిరముగ నిశ్చయము చేసుకొనిన వాడగుట వలన ఆతడు అపహాసమున అట్లు తూలుచూ నడుచుచున్నచో వెంటనే భస్మమగు నట్లును కానియెడల దృఢశరీరుడై సుందరశరీరుడై సుందరాకారుడగునట్లును శపించెను. వెంటనే ఆ శాపము భగీరథునికి వరప్రసాదముకాగ భగీరథుడు దృఢగాత్రుడై సుందరాకారుడయ్యెను. అంత యోగదృష్టి వలన అతని జన్మాదులును అష్టావక్రుడు గ్రహించి ఆతడు గంగను భూమికి తీసుకొని వచ్చి అతని పితృపాదులను స్వర్గమునకు పంపునని ఆశీర్వదించి తనదారిన తాను పోయెను.

## 8 అష్టావక్రుని పూర్వజన్మ కథ

అష్టావక్రమహర్షి అనేక సంవత్సరములు పుష్కర తీర్థమునను మాల్యవంతమునను పరమవైష్ణవుడై పరమజ్ఞానియై గొప్ప తపస్సు చేసెను. పిమ్మట ఒకనాడు శ్రీకృష్ణునకు రాధా మొదలైన భార్యలు, బలరాముడు మొదలైనవారు వెంటరాగ బృందావనమున విహరించుచూ జలక్రీడలతో తృప్తి పొంది, ఒక మఱ్ఱి చెట్టుకింద కూర్చొని సరససల్లాపములాడుచుండగా అష్టావక్రమహర్షి వచ్చి శ్రీకృష్ణునకు సాష్టాంగ నమస్కారములొనర్చి ఈశ్వర దత్తమగు స్తోత్రమును ఇలా స్తుతించెను. ఆ స్తోత్రము బ్రహ్మవైవర్తమున శ్రీకృష్ణ ఖండమునందు కలదు.

"ప్రకృతియు మూలంబు బ్రహ్మేశవిష్ణువుల్
శాఖలు సురలుపశాఖలఖిల
తపములు పుష్పముల్ విపులసంసారాది
కంబులు ఫలసమూహంబు లగుచుఁ
దనరు బ్రహ్మాండపాదపమున కర్థి నా

ధారుఁడ వటు నిరాధారకుఁడవు
కడిమి సర్వాధారకుఁడవు తేజోరూపుఁ
డవును నిరాకారుడవు మహాత్మ!
సర్వమయుఁడవు మఱియు స్వేచ్ఛాయుఁడవు
ముక్తిమయుఁడవు మఱియు సేచ్ఛామయుఁడవు
ముక్తిమయుఁడవు నఖిలముముక్షువులకును
ముక్తిదాయకుఁడవు జగన్మూర్తి వీవు
నీకు నుతులాచరించెద నీరజాక్ష !

(బ్రహ్మవైవర్తము - శ్రీకృష్ణఖండము)

అటుపై అష్టావక్రుడు ఆ పరమాత్మయందు తన మనస్సును లయమొనర్చి శ్రీకృష్ణుని పాదములపైపడి మరణించెను. వెంటనే అతని తేజస్సు దివ్యరూపమును ధరించి పుష్పకవిమానమును అధిరోహించి గోలోకమునకు వెళ్ళి ముక్తిని పొందెను. ఆ సమయమున శ్రీకృష్ణుడు అతని దేహమునకు దహనాది సంస్కారములను స్వయముగ కావించి అతనికి అశ్రుతర్పణములను ఒసగి క్రియాకలాపములను ఒసగెను.

ఇది అంతయూ చూచి ఆశ్చర్యపడిన రాధ అతని వృత్తాంతము ను తెలుపమని కోరెను. అటుపై శ్రీకృష్ణుడు రాధా మొదలగు గోపికలందరు వినుచుండగ అష్టావక్రుని జన్మ వృత్తాంతమును ఈ విధంగా చెప్పెను. "ఈ మహర్షి నా పరమ భక్తుడు జితేంద్రియుడు మహా తపస్సంపన్నుడు బ్రహ్మవంశస్తుడు. పూర్వము సృష్టి ఆదిలో నా నాభికమలమునుండి బ్రహ్మను పుట్టించి విశ్వసృష్టిని చేయమని నియోగించితిని. అటుపై అతడు సనక సనందన, సనత్కుమార, సనాతనులను నలుగురు కుమారులను తన మానసమునుండి సృజించి వారితో సృష్టిని కొనసాగింపుడని కోరెను. వారు స్త్రీ సంపర్కమునకు అంగీకరించక పరబ్రహ్మ అనుసంధానమున నిత్య తపస్సులైరి. అటు తరువాత వశిష్ఠుడు, అంగిరసుడు, మరీచి, ప్రచేతనులు

అను వారిని తన మానస పుత్రులుగ పుట్టించి వారిని జగత్ సృష్టి చెయ్యమని బ్రహ్మ కోరెను. వారందరు తపఃసంపన్నులై తండ్రి ఆజ్ఞచే వివాహమాడి అనేకమంది కుమారులను పొందిరి. అందు ప్రచేతనునకు కొంత కాలము పిమ్మట అశితుడను కుమారుడు కలిగెను. అతను తపోవృత్తిచే విష్ణుభక్తుడై యుండెను. కొంతకాలమునకు ఆ అసితుడు వివాహితుడై తన సతికి సంతానము కలగని కారణముగ బాధపడుచుండగ ఆకాశవాణి ఈశ్వరుని గురించి తపస్సు చేయమని చెప్పెను. ఆ అసితుడు ఈశ్వరుని గురించి తపస్సు చేయగ అతడు ప్రత్యక్షమై 'రాధామంత్రమను' స్తోత్రమును ఉపదేశించి మాయమయ్యెను. ఆ అసితుడు ఏకాంతమున ఆ మంత్రమును చిరకాలమును జపించి రాధాకారుణ్యమున తన భార్యయందు ఒక పుత్రుని కని 'దేవలుడు' అను నామకరణము చేసెను.

అటుపై దేవలుడు మాలావతిని వివాహమాడి సంతానమును పొంది మహా విరాగియై తపస్సుయందుండెను. అతని తీవ్రమైన తీక్షణతపో అగ్నిచే త్రిలోకములను బాధింప చూచెను. అటుపై ఇంద్రుడు ఆ తపస్సు భంగముచేయ రంభను పంపెను. ఆమె ఎంత ప్రయత్నించినను ఆతని హృదయము చెలించలేదు. అందుచే ఆమె కోపించి "ఓ దేవలా! నీవు నన్ను అష్టకష్టముల పాలు చేసితివి. నా కోరిక నెరవేరలేదు కావున నీవు మరుజన్మమున అష్టావక్రుడవై జన్మించెదవు" అని శాపమును ఇచ్చెను. అటుపిమ్మట అష్టావక్రుని చూసి రంభ ఇట్లు పలికెను "నేను నిన్ను అనవసరముగ శపించితిని. నీవు అష్టావక్రుడవై జన్మించినను నీ తండ్రి కృప వలన దివ్యశరీరుడవై మహాజ్ఞానివై ముక్తిని పొందగలవు" అని చెప్పెను. అతడే ఏకపాదుడు, సుజాతలకు జన్మించి 'సమంగ' నదీస్నానమున దివ్యశరీరియై మహాతపోధికుడై నేడు ముక్తి పొందినాడని శ్రీకృష్ణుడు అష్టావక్రుని చరిత్ర చెప్పి అందరితో తన మందిరమునకు పోయెను[1].

---

1. ఈ పై చరిత్ర బ్రహ్మవైవర్త పురాణమున శ్రీకృష్ణఖండమున కలదు.

## 9. అష్టావక్రుని సంహిత

ఇట్లు ప్రత్యక్షముగ శ్రీకృష్ణుని పాదారవిందముల ప్రాణములను వీడగలిగిన అష్టావక్రమహర్షి సుకృత విశేషములు వర్ణనకు అందనివి. 1. ఈ మహర్షి జనక మహర్షితో చేసిన వేదాంత విచారణ. అద్వైత వేదాంత సారము అద్భుతముగ ప్రవచించునదే 'అష్టావక్ర సంహిత'. ఇందు - ఆత్మోపదేశము, ఆత్మానుభవ ఉల్లాసము, ప్రత్యేపేక్ష పద్వారోపదేశము, ఆత్మజ్ఞానసంకీర్తనము, లయయోగము, జ్ఞాన యోగము, అనుభవ పంచకము, బంధమోక్ష వ్యవస్థ, నిర్వేదము,ఉపశమము, జ్ఞానము, స్వరూప సంస్థితి, ఆత్మసౌఖ్యానుభూతి, శాంతి, తత్త్వోపదేశము, విశేషోపదేశము, తత్త్వజ్ఞస్వరూపము, శాంతిశతకము, ఆత్మస్థితుని అనుభవము, జీవన్ముక్తి యను ఇరువది అధ్యాయములలో వివిధ విషయములను అద్భుతముగ వివరించబడినవి. ఈ సంహిత నిత్య పారాయణ యోగ్యము. అష్టావక్రుని బోధామృతమును విని జనకమహర్షి పొందిన ఆత్మానందము అనిర్వచనీయ మైనది. ఈ సంహితయందలి "ఆకాశవదనంతోஉ హం ఘటవత్ ప్రాకృతం జగత్", "మహోదధి రివాహం సప్రపంచో వీచిసన్నిభః", "అహంవా సర్వ భూతేషు"మొదలగు అద్వైతవేదాంత ఘీంకారవములు అష్టావక్ర మహర్షిని ధన్యాతిధన్యుని చేసినవి.

### అష్టావక్రమహర్షి స్తుతి

"ఏకపాద పుత్రా! అష్టావక్రా! మాతృగర్భ జ్ఞాన కోవిదా! పిత్రు రక్షకా!
ఏకానేక మహిమాన్విత అష్టావక్ర సంహిత రచనా విధాత ప్రజ్ఞా!
ఏకపాద పునరుజ్జీవిత శక్తి పురుషా! సుప్రభ పతే! హే మహర్షే!
ఏకపాద వంశాంబుధి చంద్ర ప్రకాశా! హే అష్టావక్రా! నమస్తే నమస్తే!"

ഇ ❖❖ ❖ ଔ

# 4. ఋష్యశృంగమహర్షి

పూర్వము కశ్యపుడను ముని శ్రేష్ఠునకు విభాండకుడను కుమారుడు కలిగెను. అతడు బాల్యము నుండియే అస్ఖలిత బ్రహ్మచర్యదీక్షతో తపస్సు చేయుచుండెను. ఒకానొకనాడు మడుగులో స్నానమాడుచుండగా అక్కడికి సౌందర్యరాశి అయిన ఊర్వశి తన హావభావ విన్యాసములు అతనిని కామకృతునిచేయగ ఆ విభాండకుని వీర్యము ఆ మడుగు నీళ్ళలో కలియగ దానిని ఒక ఆడలేడి నీటితోపాటుగాత్రాగి గర్భమును ధరించెను.

## 1. ఋష్యశృంగుని జననము

విభాండకుని వీర్యమును గ్రోలిన ఆ జింక పూర్వము చిత్రరేఖ అను అప్సరస. ఆమె ఇంద్రసభలో నాట్యమాడుచుండగకొన్ని లేళ్ళు అచ్చటికి వచ్చెను. చిత్రరేఖ కనులపై దృష్టినుంచి ఆనందించుచున్నది. ఇంద్రుని చూడక ఆమె లేళ్ళను చూచెను. ఆసమయమున కోపగించిన ఇంద్రుడు ఆడ జింకగ పుట్టమని శపించెను. అప్పుడామె శాపవిమోచనమును కోరగ విభాండకుడను మహర్షి వీర్యము వలన పుత్రుని కనిన పిమ్మట శాపవిమోచనమగునని తెలిపెను. ఆ చిత్రరేఖయే మృగియై దాహము తీర్చు కొనుటకు విభాండకుడు స్నానముచేయు జలాశయమునకు వచ్చి జలముతో పాటు అతని వీర్యమునుత్రాగి గర్భిణి అయ్యెను. ఇది మనము ఋష్యశృంగుని తల్లియగు ఆడమృగము యొక్క పూర్వజన్మమైన చిత్రరేఖ అను అప్సరసగ చెప్పుకొనవచ్చును. అలాగే ఊర్వశిచేత ప్రేరేపింపబడిన కామపీడితుడగు విభాండకుడి వీర్య జననము వలన జన్మించిన ఋష్య

శృంగుడు అనగ మనుష్యరూపముతో జింకకొమ్ములు కలవాడని చెప్పుకొన వచ్చును. అలాగే ఇతడు కశ్యపునికి పౌత్రునిగాను చెప్పుకొనవచ్చును. ఇకపై ఋష్యశృంగుని జనన వృత్తాంతమును తెలుసుకొందాము.

కొంతకాలమునకు ఆ మృగము మనుష్యరూపముగల ఒక పుత్రుని కని అరణ్యమున విడిచి తన శాపవిమోచనము కాగ ఇంద్ర లోకమునకు పోయెను. ఆ బాలుడు ఆ జింకకు ఉదయించుటచే ఆతని నొసట ఒక శృంగము (కొమ్ము) ఉండెను. దానివలన అతనికి ఋష్య శృంగుడని పేరు వచ్చెను. ఇలా కాలము గడుపుచుండగా ఒకనాడు విభాండకుడు చూచి తన దివ్యదృష్టిచే అతడు తన కుమారుడని గ్రహించి అతనిని తన ఆశ్రమమునకు తీసుకుపోయి పెంచుచుండెను. ఇలా ఉండగా అతడు తన తండ్రి ఆశ్రమముననే బ్రహ్మచారియై పరమ స్వాధ్యాయము (వేదమును వల్లెవేయువాడుగ) చేయువాడుగ అద్వితీయ బ్రహ్మచారియునై ఘోరతపస్సు చేయుచుండెను. అది గమనించిన ఇంద్రుడు అతడు ఎక్కడ ఉండిన అక్కడ మంచివానలు కలుగుననియు, ప్రజలు వ్యాధిరహితులై సుఖముగా ఉండెదరనియు మనసున ఊహించెను.

**2. రోమపాదుని వృత్తాంతము**

అంగదేశమును పరిపాలించు రోమపాదునకు సంతానము లేకుండెను. ఇతడు దశరథుని మిత్రుడు. ఒకనాడు ఆతడు అయోధ్యకు వచ్చి దశరథునకు సురభివలన శాంత అను కూతురు కలుగగ ఆమెను చూచి ముద్దాడి తాను ఆ బిడ్డను పెంచుకొనుటకు అడిగెను. కాని దశరథుడు బిడ్డలు లేని కారణమున ఆతడు అంగీకరించలేదు. అక్కడే ఉన్న త్రికాలజ్ఞుడగు వశిష్ఠమహర్షి దశరథునితో శాంతను రోమపాదునకు ఇవ్వమనియు ఆమెవలన త్వరలో ఇరువురికిని పురుషసంతానము కలుగునని చెప్పెను.

ఇది ఇలా ఉండగా దశరథుడు, రోమపాదుడు ఒక అంగీకార మునకు వచ్చి సురభికూతురగు శాంత ఆరుమాసములు దశరథుని యింటను, ఆరు మాసములు రోమపాదుని యింటను ఉండునట్లు ఒప్పందము కుదుర్చుకొని రోమపాదుడు శాంతను తీసుకొని వంగ దేశము నకు వెళ్ళెను. అటు కొన్నాళ్ళకు అతడు పుత్రకామియై బ్రాహ్మణులకు అనేక దానధర్మములను చేయుచుండెను. ఒకనాడు ఒక బ్రాహ్మణుడు బహు ధనధాన్యములను గైకొని తిరిగి తన కుమారునితో వచ్చి ఆ బాలునకు ఒక గోవును ఇవ్వమని రోమపాదుని కోరెను. కాని కోపగించిన రోమపాదుడు బ్రాహ్మణులు దురాశపరులని నిందించెను. గోవు ఇవ్వక నిరాకరించి, బ్రాహ్మణులందరిని దూషించెను. ఆ సమయమున ఆ బ్రాహ్మణుడు, అతని కుమారుడు ఆ రాజును కోపించి అతని రాజ్యము కరువు కాటకము లతో అనావృష్టిగా మారునని శపించి వెళ్ళిపోయెను.

ఆ తరువాత రోమపాదుడు పశ్చాత్తాపుడై దీనికి పరిష్కార మార్గము ఏమని మిగిలిన బ్రాహ్మణులను కోరగ వారు ఋష్యశృంగుని చరితను వినిపించి అతని అనుగ్రహముచే మేలుకలుగునని చెప్పిరి. అంత రోమపాదుడు ఆ బ్రాహ్మణులను పూజించి వారి అనుమతితో కొందరు వారాంగలను (వేశ్యలను) అందులోను సర్వకళాపూర్ణ అను వేశ్య ఆధిపత్యముగ ఋష్యశృంగుని పిలుచుకురమ్మని పంపెను.

### 3. సర్వకళాపూర్ణాది వేశ్యలు ఋష్యశృంగుని కొనిపోవుట

నవయవ్వనులు, అతి విలాసవతులు అగు ఆ వారాంగనలు విభాండకుడు ఆశ్రమమున లేని సమయమున ఋష్యశృంగుని దగ్గరకు వచ్చిరి. ఏనాడునూ స్త్రీముఖమును చూడని ఋష్యశృంగుడు వారు మునికుమారులనుకొని వారికి అర్ఘ్యపాద్యాదులను ఇవ్వగ వారు స్వీకరించక, వారు తెచ్చిన దివ్యగంధమాల్యములు, సరసభక్షములు, విచిత్ర

వస్త్రములను ఇచ్చిరి. తమ నృత్యగీతములతో ఆతనిని ఆనందిప చేసి, ఆతనిని కౌగిలింప ఒడలు పులకింప చేసి మోసపుచ్చి తమ ఆశ్రమము ప్రక్కనే ఉన్నదనియు అందు తపము చేయమని పిలచిరి.

ఇంతలో తండ్రియగు విభాండకుడు అచ్చటకు వచ్చెను. అతనిని చూచి భయపడి ఆ వారాంగనలు వెళ్ళిపోయిరి. అటుపై దినసరి సమయముగ జరిపెడి అగ్నిహోత్రం వెలిగించుట మరచిన ఋష్యశృంగుని విభాండకుడు కారణమడిగెను. అంత ఋష్యశృంగుడు "ఓ తండ్రీ ! ఇచ్చటికి కొందరు సుందరాకారులగు ముని బాలురు వచ్చిరి. వారు కట్టిన చీరలు అతి మృదువుగా ఉన్నవి. వారి శరీరములు చాలా అందముగా యున్నవి. వారి స్వర ఉచ్చారణ ఎంతో ఆనందప్రదముగా ఉన్నది. అందులోను ఒక ముని బాలుడు తనను కౌగలించుకొని ముఖములో ముఖము పెట్టి ఒక మృదు మధురమగు శబ్దము చేసెననియు వారు నన్ను తపము చేసుకొనుటకు పిలిచెరనియు కావున నేను వారితో తపము చేసుకొనుటకు ఇష్టపడు చున్నానని" పలికెను. ఆ మాటలను విన్న విభాండకుడు అవన్నియు రాక్షస మాయలనియు, వారి దానములన్నియు వదలివేయవలెననియు ప్రబోధించెను.

అటుపై మరుసటిరోజు విభాండకుడు ఆశ్రమమునలేని సమయమున వేశ్యాంగనలు ఋష్యశృంగుని సమీపించగా అతడు అమిత ఆనందముతో వారివెంట వనమునకుపోవ అంగీకరించెను. ఇలా ఈ వేశ్యాంగనలు తమ కోరిక నెరవేరినందులకు ఆతనిని మచ్చిక చేసుకొనుచు మేలైన ముద్దులను ఒసగుచూ ఆ ముగ్ధమౌనిని అంగదేశమునకు తీసుకొని వచ్చిరి. ఆతడు ఎప్పుడైతే రాజాశ్రయమగు దివ్యభవనమునకు వచ్చెనో వెంటనే ఆ రాజ్యమున కుంభవృష్టి కురిసెను. రోమపాదుడు అమితమైన ఆనందమును పొంది శాంతను ఆతనికిచ్చి వివాహము చేయుటకు ఆలోచించుచూ ఆతనిని పూజించుచుండునే ఉండెను.

## 4. శాంత ఋష్యశృంగుల వివాహము

త్రేతాయుగమున రామాయణేతిహాసములో ప్రఖ్యాత శాంత ఋష్యశృంగుల వివాహము అయోధ్యలో వారికి గల గౌరవ మర్యాదలు దశరథునిచే ఋష్యశృంగుడు అశ్వమేధ, పుత్రకామేష్ఠి యాగముల చేయించటము ఇటువంటి విషయములను గురించి సాక్షాత్తు మహావిష్ణువే శ్రీరాముడిగా అయోధ్యలో అడుగిడ దశరథునికి పుత్రకామేష్ఠి యాగము జరిపించిన యాగధనులు ఋష్యశృంగుల వారి వివాహఘట్టముతో మనము ఇలా తెలుసుకుందాము.

మనకు మామూలుగ ఈ ఋషులచరిత్రలలో తెలిసిన సారాంశమే మనగ ఇటు త్రేతాయుగమైతేనేమి అటు ద్వాపర యుగమైతేనేమి సాక్షాత్తు శ్రీరామ, శ్రీకృష్ణులు మహావిష్ణు స్వరూపులుగ అవతరించిన సమయము లలో గురుస్థానమున ఈ ఋషివర్యులు గావించిన మంత్రతంత్రయంత్ర బలముల మనోదీక్షతో కూడి వీరి తపోదీక్ష చాలా గొప్పదిగ మనకు తెలియు చున్నది. నాటి ఋషుల చరిత్రలను ముఖ్యముగ పరిశీలిస్తే వీరందరు బ్రహ్మచర్య, గృహస్థాశ్రమ, వానప్రస్థాశ్రమములను స్వీకరించియే తమ జీవిత పరమావధి అయిన 'ముముక్షితే ఇతి మోక్షః' అన్నటుల భగవదైక్యములో మోక్షము పొందిరి అని ఇంచుక తెలియుచున్నది. కావున "కామిగానివాడు మోక్షగామి కాడు" అన్నటుల ప్రతి పురుషుడు కూడా తాను గృహస్థాశ్రమమును స్వీకరించకుండగనే మోక్షార్హుడు కాలేడని దీనికి ఆధారముగ ధ్యాన ధారణ సమాధులతో కూడిన రాజయోగము ఉటంకించుచున్నది.

ఇకపై ఈ శాంత ఋష్యశృంగుల వివాహ ఘట్టములను తిలకించెదము. ఒకానొకనాడు ఋష్యశృంగుడు పరమ సౌందర్యవతి, వినయ విద్యావతి యగు శాంతను చూచి ఆమె అద్వితీయమైన సౌందర్యము నకు ముగ్ధుడై రోమపాదునివద్ద ఆమెను గూర్చి వివరములను అడిగెను.

అంత రోమపాదుడు ఆమె దశరథుని పుత్రియనియు దశరథుడు తన మిత్రుడనియు ఆమెపైగల మమకారముచే ఆమెను పెంచు కొనుటకు తీసుకువచ్చెననియూ చెప్పగ అంత ఋష్యశృంగుడు దశరథుని వృత్తాంతమును అడుగగ రోమపాదుడు అతని చరిత్రను ఇట్లు తెలిపెను. పూర్వము దశరథుడు శాంతయొక్క స్వయంవరమును చాటగా ఆ స్వయంవరమునకు అనేక రాజులు వచ్చెను. అంత అక్కడికి పరశురాముడు వచ్చి దశరథుని చంప ప్రయత్నించగా వశిష్ఠమహర్షి కోరికపై దశరథుని కుమార్తెయగు శాంతను బ్రాహ్మణునికే ఇచ్చి వివాహము చేయవలెనని శాసించి దశరథుని చంపక విడిచిపెట్టెనని ఈ వృత్తాంతమును రోమపాదుడు ఋష్యశృంగునికి చెప్పెను. అంత కశ్యపుని మనుమడు, విభాండకుని కుమారుడు, సద్బ్రాహ్మణుడు అయిన ఋష్యశృంగుడు సంతసించి శాంతను వివాహ మాడెను.

అటుపై రోమపాదుడు మిగుల ఆనందముతో వివాహ వైభవమును పురమంత చాటెను. గొప్ప వైభవముగ ఋష్యశృంగుల వివాహము జరిగెను. అటుపై రోమపాదుడు ఋష్యశృంగునికి ఎన్నో సన్మానములను చేయగ శాంతా సహితుడై రాజ మందిరమున ఋష్యశృంగుడు నివసించెను. ఈ సమయముననే రోమపాదునకు పుత్రోత్పత్తి నిమిత్తమై ఋష్యశృంగుడు అంగదేశమున ఇంద్రునిగూర్చి ఒక ఇష్టి చేయించెను. అందులకు సంతోషించిన ఇంద్రుడు రోమపాదునకు పుత్రుడు ఉదయింప వరమిచ్చెను. ఋష్యశృంగుని ఆశీర్వచనముచే రోమపాదునకు పుత్రుడు ఉదయించెను.

రోమపాదుడు, శాంత ఋష్యశృంగులపై భక్తిభావముతో వారికి ఎన్నో పూజలను చేయుచూ వారిపై గౌరవ భావములతో మెలుగు చుండెను[1].

---

1. ఈ ఇతివృత్తము భారతమున అరణ్యపర్వమునందు కలదు.

### 5. శాంత, ఋష్యశృంగులు అయోధ్యకు పోవుట

ఒకానొకనాడు అయోధ్యానగరమున దశరథునిచే పుత్రకామేష్టి యాగము చేయింప వశిష్ఠ మహర్షి సనత్కుమారుడు పూర్వము చెప్పిన ఇతివృత్తమును దశరథునికి గుర్తుచేసి పుత్రకామేష్టి యాగమును చేయుటకు పురిగొల్పెను. అంత దశరథుడు ఆనందంతో వశిష్ఠుని పూజించి చతురంగ బలములతో అంగదేశమునకు ఋష్యశృంగుని పిలుచుకొని వచ్చుటకు బయలుదేరెను.

అంగదేశమునకు పోయి దశరథుడు గొప్ప తేజస్సుతో ప్రకాశించే ఋష్యశృంగుని దర్శించి అనేక విధముల పూజించెను. రోమపాదుడు దశరథుని అనేక విధముల గౌరవించెను. అంత దశరథుడు శాంతఋష్యశృంగులను, రోమపాద దంపతులను తన యింటికి రమ్మని ఆహ్వానించెను. రోమపాదుడు తాను తరువాత వచ్చెదనని పలికి శాంతఋష్యశృంగులను దశరథుని వెంట అయోధ్యకు పంపెను.

అటుపై శాంత ఋష్యశృంగులు, దశరథుడు అయోధ్యకు ప్రవేశించేసరికి పురసతులు వారికి అభినందసూచకముగ వారిపై లాజలు, అక్షతలు, వికసించెడి పువ్వులను చల్లిరి. జనులందరు వారికి ఉత్సాహముతో మొక్కిరి. ఇంతలో అంతఃపురము దగ్గరకు రాగా రాజస్త్రీలు నీరాజనములతో ఎదురువచ్చి హారతులను ఇచ్చిరి. దశరథుడు రథము దిగి ఋష్యశృంగుని మంగళవాద్య శబ్దముల నడుమ లోనికి తీసుకొని పోయెను. పుణ్యస్త్రీలు శాంతదేవిని అంతఃపురమునకు తీసుకొనివెళ్ళిరి. అక్కడున్న దశరథుని పత్నులైన కౌసల్య, కైకేయి, సుమిత్రాదులు ఎంతో ఆనందముతో "అమ్మా శాంత! ఇక నీవు మా బిడ్డవు కావు. మాకు పూజ్యనీయమైన మహర్షిపత్నివి. నీకు వందనములమ్మ" అని పలికిరి. అంత శాంత చిఱునగవుతో అందరిని కౌగలించుకొనెను. ఈ విధంగా శాంత ఋష్యశృంగ

మహర్షులకు అయోధ్యనగర అంతః పురములో అనేక మర్యాదలతో కూడిన పూజలు జరుగుచుండెను.

## 6. ఋష్యశృంగుడు దశరథునిచే అశ్వమేధి, పుత్రకామేష్టి యాగములను చేయించుట

ఋష్యశృంగుడు శాంత ఇరువురు అమిత మర్యాదలతో దశరథునిచే పూజింపబడుచూ కాలము గడుపుచుండగా యజ్ఞ నిర్వహణమునకు అనుకూలమగు కాలము సమీపించెను. బహు పాదములతో పాటు దశరథుని మనోవృక్షము చిగిర్చినదన్నట్లుగ ఆతడు ఒకనాడు ఋష్యశృంగుని పిలిచి పుత్రకామేష్టియాగము చేయింప వలెనని కోరెను. అయోధ్యలోని సరయూనది ప్రాంతమున ఉత్తరదిశలో యజ్ఞశాల నిర్మింపబడెను. ఉత్తమోత్తములైన ఋత్విజులతోడను, మహాత్ములతోడను యజ్ఞము ప్రారంభమయ్యెను. మంత్రులు దశరథుని ఆజ్ఞచే అన్నియు నిర్వహించి యాగఅశ్వము వదలెను. సంవత్సరము గడిచి తిరిగి వసంతమాసన్నమగుసరికి యజ్ఞ అశ్వము సురక్షితముగ వచ్చి చేరెను.

అటుపై దశరథుడు గురువైన వశిష్ఠుని పూజించి యజ్ఞభారము సమస్తము పూనవలెనని ప్రార్థించెను. వశిష్ఠుని ఆజ్ఞచే అన్నియు సమకూరెను. యజ్ఞమునకు కావలసిన సామాగ్రి అంతయు చేరెను. కుండమండప వేదికాదులు, సత్రాగారములు, కాయమానములు మున్నగునవి అన్నియు నిర్మింపబడెను.

ఆ యాగమును చూచుటకు జనకమహారాజు, కేకయ మహారాజు, సింధూదేశ ప్రభువు మొదలగు వారందరూ వచ్చిరి. అటుపై అనేక బ్రాహ్మణ సమూహములు, వశిష్ఠులు మొదలైన ప్రముఖులు ఋష్యశృంగుని ముందిడుకొని యజ్ఞకర్మ ఆరంభమున విహిత క్రమమున ఆ అశ్వమేధమును సమాప్తినొందించిరి. దశరథుడు అనేకమైన గొప్ప దక్షిణ తాంబూలములతో

బ్రాహ్మణులను సత్కరించెను. అటుపై దశరథుడు ఋష్యశృంగుని సమీపించి "మీ దయతో యజ్ఞము పూర్తి అయినది. అశ్వమేధయాగము పూర్తయిన తరువాత, మిగిలిన ఈ పుత్రకామేష్టియు కూడ చేయుడని" ప్రార్థించెను.

ఇక్కడ మనకు అవగతమగు విషయమేమనగ ఆనాటి వైదిక కార్యములలో ఈ యజ్ఞయాగాది క్రతువుల ఫలములు ఎటువంటివో అవి చేయించు ఋత్విజుల తపఃశక్తితో కూడిన మంత్రబలము లెటువంటివో వారి వాక్శుద్ధి ఎటువంటిదో తెలియుచున్నది. ఇష్టి అనగానే యాగము అని అర్థము. పుత్ర + కామ + ఇష్టి = పుత్ర కామేష్టి యాగము అనగ పుత్రకోరికను ఉద్దేశించి చేయు యాగము. ముఖ్యముగ మనము ఇక్కడ తెలుసుకోవలసింది సాక్షాత్తు మహావిష్ణువు స్వరూపుడైన శ్రీమన్నారాయణుడే భూలోకమున ధర్మప్రభువుగ ఆదర్శపురుషుడుగ పితృవాక్పరిపాలకుడుగ అవతరించుటకు గురుస్థానమునగల ఈ ఋష్యశృంగుని యొక్క తపోశక్తి యొక్క గొప్పతనమే దశరథునిచే పుత్రకామేష్ఠియాగమును చేయించుటకు మూలమయ్యెను.

ఋష్యశృంగుడు నానామంత్ర పూరితముగ ఆహూతులకు అగ్నిలిడుచు పుత్రకామేష్టియాగము చేయుచుండ ఆ పావన హోమాగ్ని వలన ప్రాజాపత్య పురుషుడు, దేవనిర్మితము ఆరోగ్య వర్ధనము పుత్రోత్పత్తి కరమును అగు పాయసము ఒక పవిత్ర హేమ పాత్రను తెచ్చి దశరథునకు ఒసగి అంతర్థానమయ్యెను. ఋష్యశృంగుడు దశరథుని ప్రేమతో పిలిచి ఆ పాయసమును ఆతని భార్యలకు పంచి యివ్వమని చెప్పెను. దశరథుడు సంతసముతో ఆ పాయసమును కౌసల్యకు సగము, మిగిలిన సగములో సగము సుమిత్రకు, మిగిలిన దానిలో సగము కైకేయికి త్రాగనిచ్చి మిగిలిన భాగములోని 8 వ భాగమును మరల సుమిత్రకు ఇచ్చి త్రాగమనెను. కొంత కాలమునకు ఈ పాయస ప్రసాదము మూలముగ వరుసగ శ్రీరాముడు, భరతుడు, లక్ష్మణుడు, శత్రుఘ్నులు జన్మించెను.

ఇలా యాగము ముగిసిన పిమ్మట పాయసమును దశరథుడు యజ్ఞ ప్రసాదముగ ముగ్గురు భార్యలకు ఇచ్చిన పిమ్మట ఋష్యశృంగుడు తన భార్య శాంతతో సహా తండ్రి విభాండకుని ఆశ్రమమునకు వెళ్ళెను. దివ్యదృష్టితో ఇది అంతయు గమనించిన విభాండకుడు కొడుకు, కోడలును చూచి సంతసించెను. మనకు లోకమున ఆదర్శ దంపతులుగ వశిష్ఠుడు - అరుంధతి , అత్రి - అనసూయ, అగస్త్యునకు - లోపాముద్ర వలెనే ఋష్యశృంగునకు - శాంతయు ధర్మపత్నిగ పేరొంది కాలక్రమమున శాంత ఋష్యశృంగునిచే చతురంగుడగు ఉత్తమకుమారుని ప్రసవించెను[1].

### 7. ఋష్యశృంగుని ద్వాదశ వార్షిక యాగము

ఒకానొక సమయమున ఋష్యశృంగుడు ద్వాదశ వార్షిక యాగమును ప్రారంభించెను. ఆ యజ్ఞమును చూచుటకై చూలాలైన సీతయు, ఆమె ప్రియమునకై శ్రీరాముడును అతని తమ్ముడు లక్ష్మణుడు ఆశ్రమమునందే ఉండిపోయెను[2].

### ఋష్యశృంగ స్మృతి

ఋష్యశృంగ మహర్షి యొక్క స్మృతి ఒకటి కలదు. ఆచారశౌచ శ్రాద్ధ ప్రాయశ్చిత్తమునకు 'మితాక్షరాపరార్కస్మృతి చంద్రిక'. ఈ స్మృతి నుండి తత్సంబంధ శ్లోకములనుదహరించినవి. మితాక్షరమున శంఖునిదని పేర్కొనబడిన ఒక శ్లోకమును అపరార్కము ఋష్యశృంగ స్మృతి లోనిదని పేర్కొన్నది. 'స్మృతి చంద్రిక' 'అపి వాససా యజ్ఞోప వీతార్థాన్ కుర్యాత్ తదభావే త్రివృతాసూత్రేన' అన్న వచనము ఈ స్మృతిలోనిదని పేర్కొన్నది. సమగ్రముగ స్మృతి ఇంకను లభింప వలసియున్నది.

---

1. ఈ వృత్తాంతము మనకు రామాయణమున కలదు.
2. ఈ ఇతివృత్తము ఉత్తర రామాయణమునందున్నది.

ఋష్యశృంగుడు మహోత్తమ తపశ్శాలియై శ్రీరామాదుల లోకమునకు ప్రసాదించిన పరమపుణ్యాత్ముడు. కావున ఆతని నామ స్మరణము అతిపవిత్రము.

## ఋష్యశృంగమహర్షి స్తుతి

"ఋష్యశృంగ నామాత్మకా!విభాండక పుత్రా!శాంతాపత్ని ఋషీశ్వర వరా!
ఋష్యశృంగ వరా! తపోదీక్షా పరా! దశరథ అశ్వమేధ సూత్రాన్వితా!
ఋష్యశృంగ ద్వాదశవార్షికయాగ గురుతేజా! ఋష్యశృంగ స్మృతి కర్తా!
ఋష్యశృంగ ఋషే! దశరథాత్మజ శ్రీరామ ప్రియ ఋషే! నమస్తేనమః"

❧ ❖❖❖ ☙

## 5. కపిలమహర్షి

పూర్వము కర్దమ ప్రజాపతి కృతయుగమున విశ్వసృష్టికై బ్రహ్మచే నియోగింపబడి సరస్వతీనదీతీరమునకేగి పదివేల దివ్య సంవత్సర ములు తపస్సు చేసెను. ఇలా ఉండగ ఒకనాడు జపసమాధిలో ఏకాగ్ర చిత్తుడై విష్ణుమూర్తిని ధ్యానింపగ అతను ప్రత్యక్షమై దేవహూతి వలన 9 మంది కుమార్తెలు, తన అంశచే ఒక కుమారుడు కలుగునని చెప్పెను.

కర్దమునకు పుట్టిన 9 మంది కుమార్తెలపేర్లు 1. కళ 2. అనసూయ 3. శ్రద్ధ 4. హరిర్భువు 5. గతి 6. క్రియ 7. ఖ్యాతి 8. అరుంధతి 9. శాంతి. అలాగే 9 మంది కుమార్తెల తర్వాత కర్దమునకు, దేవహూతికి పుట్టిన విష్ణుమూర్తి అంశయై జన్మించిన వాడే కపిలమహర్షి. ఈ కపిల మహర్షి పుట్టుటకు కూడ ఒక పురాణ కథ కలదు.కర్దముడు కుమార్తెలు పుట్టిన తరువాత సన్యసింప ప్రయత్నించ అతని ధర్మపత్ని అయిన దేవహూతి అతని పాదములకు మ్రొక్కి "ఓ దేవా! కూతుంద్రకు యుక్తకాలమున వివాహము చేసి ఆపై నాకు జ్ఞానోపదేశము చేయవలెను. సుకుమారుని దయచేయుము. నేను తరించిన పిమ్మటకాని తాము సన్యసింపవలదు" అని బ్రతిమలాడెను.

ఆమె కోరికను మన్నించి కర్దముడు ఆమెతో ఇలా చెప్పెను."నీ గర్భమున అచిరకాలములోనే మహావిష్ణువు స్వరూపముతో ఒక కుమారుడు పుట్టును కావున నువ్వు ఎల్లప్పుడు ఆ జనార్ధనుని పాదపద్మములను పూజించుచుండమని ఆకుమారుడే నీ శంకను తొలగించునని" పలికి గృహముననే ఉండెను.

**1. కపిలుని జననము**

దేవహూతి భర్తయగు కర్ధముడు చెప్పినట్లుగనే విష్ణుమూర్తిని ధ్యానించుచుండగ కొంతకాలమున గొప్ప తేజస్సున విష్ణుమూర్తి దేవహూతి గర్భమున ప్రవేశించెను. వైశ్వానరుడు రాక్షసులను సంహరింప శమీతరు కోటరమున జన్మించినట్లుగ ఆమె గర్భమున కుమారుడై జన్మించెను. ఆ సమయముననే శుభశకునములుగ దేవతల సమూహము మందారపుష్ప వర్షమును కురిపించిరి. గంధర్వులు, కిన్నెరలు పాటలు పాడిరి. అప్సరస స్త్రీలు నాట్యమాడిరి. బ్రహ్మ, మరీచి మొదలైన వారిని వెంట పెట్టుకొని వచ్చి దేవహూతి కర్ధముల కుమారుడును విష్ణుఅంశుడగు విష్ణుని చూసి మరీచిని వదిలిపెట్టి సనకసనందనులు, నారదుడు మొదలగు వారితో మాయమయ్యెను.

**2. కపిలమహర్షి తండ్రికి కర్తవ్యము బోధించుట**

కర్దమ ప్రజాపతి తన తొమ్మిది మంది కుమార్తెలకు తొమ్మిది మంది వరులను ఇలా ఏర్పరచెను.

| | | | |
|---|---|---|---|
| 1. కళ | - మరీచి | 2. అనసూయ | - అత్రి |
| 3. శ్రద్ధ | - అంగిరసుడు | 4. హరిర్భువు | - పులస్త్యుడు |
| 5. గతి | - పులహుడు | 6. క్రియ | - క్రతువు |
| 7. ఖ్యాతి | - భృగువు | 8. అరుంధతి | - వశిష్ఠుడు |
| 9. శాంతి | - అధర్వుడు | | |

అటుపై కుమారుడగు కపిల మహర్షిని చూచి ఏకాంతముగ తీసుకొని వెళ్ళి నమస్కరించి “ఓ మహానుభావా! పరమేశ్వరుడవైన నీవు నాకు ఇచ్చిన మాట ప్రకారము నీవు జన్మించితివి. కావున నేను ఋణ త్రయమునుండి తొలగితిని. కావున ఇక యోగసమాధిలో నీ పాదార

విందములను మనస్సున చేర్చుకొని సంసార దుఃఖమును పోగొట్టుకొని ఏకాంత స్థలమున సంచరించెదనని" పలికెను.

ఆ మాటలను విన్న కపిల మహర్షి "నేను చెప్పినట్లుగనే నీ యింట పుట్టుటకు ఒక కారణ విశేషమున్నది. నేను సన్ముని వేషము ధరించుట నాకొరకు కాదు మహాత్ములగు మునులకు తత్త్వ బోధ చేయుటకే. నీవు ఏకాంత మనస్కుడవై నన్నే భక్తితో సేవించి మోక్షము పొందుమని" కర్తవ్యమును బోధించెను.

అటుపై కర్దముడు విష్ణువుపై అధికమైన భక్తితో ముని సమూహమును సేవించుచుండగ ఆత్మైకశరణ్యతత్పరుడై (కేవలము భగవంతునిలో తన ఆత్మలీనమగుటయే దృష్టికలిగి యుండుట) పరబ్రహ్మమున మనస్సును నిలిపి సమత్వమైన శాంతముతో 'సర్వదేవ నమస్కారం కేశవం ప్రతి గచ్ఛతి' అని తపస్సులోనుండెను. అలాగే కపిలమహర్షి కూడా ఏకాంత దీక్షతో బిందుసరోవరతీరమున తీవ్ర తపో నిమగ్నుడై యుండెను.

**3. కపిలమహర్షి దేవహూతికి మోక్షము ఒసగుట**

అంత తల్లియగు దేవహూతి కుమారుని దర్శించి ఆతని శరణము వేడి రక్షించమని ఆశ్రయించెను. కపిలమహర్షి ఆమెకు ఇలా సలహా యిచ్చెను. "ఓ తల్లీ! జీవుని చిత్తము సంసారమున తగులుకొని సత్త్వరజస్తమో గుణములతో కూడి సుఖశాంతులు లేక బాధపడు చున్నది. అదియే జీవుని చిత్తమును నారాయణునివైపు మరల్చినచో మోక్షకారణమగును" అని పలికెను. ఇక్కడ మనకు ప్రహ్లాదుని మాటలు కూడా గుర్తుకు వచ్చును.

"కమలాక్షునర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వా జిహ్వా "

అను ప్రహ్లాదుని మాటలను వర్ణించిన బమ్మెర పోతన గారి మాటలు గుర్తుకు వచ్చుచున్నవి. నారాయణుడే దైవము. నారాయణుని నామస్మరణము ఒక్కటే మోక్షకారణము. "బ్రహ్మమొక్కటే పరబ్రహ్మమొక్కటే" అనెడి అన్నమయ్య మాటలు కూడా గుర్తుకు వచ్చుచున్నవి. అటుపై అతడు ఆమెకు సాంఖ్యయోగమును, భక్తి యోగమును బోధించెను. ఇలా కపిల మహర్షిచే బోధలు (జ్ఞానం) అందుకొన్న దేవహూతి కపిలుడు చెప్పిన మార్గమున గురుయోగశక్తి చేత ఆకసమునకు ఎగసి ఆ మహావిష్ణువు యొక్క పాదమనస్కురాలై ఆ శ్రీహరిలో కలిసిపోయెను.

ఇలా ఆమె మోక్షమును పొందిన క్షేత్రమునకే 'సిద్ధపదము' అను పేరుతో ప్రసిద్ధికెక్కెను. అంత కపిలమహర్షియు సిద్ధచరణాదులు కొలువ సముద్రునిచే పూజలను అందెను. అటుపై తాను సాంఖ్యాచార్య అభిష్టిత మగు యోగమును అవలంబించి శాంత సమాహితుడై తన తండ్రి ఆశ్రమమును వదలి యుదద్భాగమునకు (పై లోకములకు) వెళ్ళిపోయెను[1].

## 4. కపిలమహర్షి వేద ప్రామాణ్యబుద్ధి

ఒకప్పుడు కపిలమహర్షి ఉత్తమమైన ఆకారముగల గోవును చూచి వేదస్వరూపమని పలికియు నిర్లక్ష్యముగయుండెను. ఆటుపై కొంత దూరముననున్న 'సూర్యరశ్మి' అను సంయమి కపిలునకు వేదములయందు ఏ భావమున్నదో తెలుసుకొనగోరి సూక్ష్మరూపమున ఆ గోవునందు ప్రవేశించి "ఓ మహర్షి! వేదములు దాంభికత్త్వ పాదకములని యతులు పలికెదరు. నీవు నా అభిప్రాయముతో ఏకీభవింతువా!" అని పలికెను.

అందులకు జవాబుగ కపిలమహర్షి" వేదములయందు నాకు ఆదర అనాదర భావములు లేవు కాని సంసారులు ఎల్లరకును వేద

---

1. ఈ ఇతి వృత్తము భారతమునందలి హరివంశములో కలదు.

విహితమైన ఆచారము కావలయును. కాని ఉపస్థము, ఉదరము, వాణిపాణి అనునవి మూయరాని వాకిళ్ళు. వానిని మూయగల్గిన పండితులకు తపోదానవ్రతాదులుకాని, వేదప్రామాణ్యములు కాని అవసరములేదు" అని చెప్పెను. కావున పై విధముగ సూర్యరశ్మి అను సంయమికిని కపిల మహర్షికి ప్రశ్నోత్తరములు జరిగెను. అంత సూర్యరశ్మి సంతసమున గోగర్భమునుండి బయటపడి కపిలునకు నమస్కరించి "సత్యము తెలుసుకొనగోరి ఈ విధముగ గోగర్భమున చొచ్చి ప్రశ్నించితిని. నన్ను మన్నించి వేదప్రామాణ్యమును గురించి నా మనఃశాంతి కొరకు ఇంకను చెప్పమని" వేడుకొనెను.

అటుపై కపిలమహర్షి ఇలా చెప్పెను -

1. వేదములే లోకమునకు ప్రమాణములు
2. శబ్ద బ్రహ్మ పరబ్రహ్మలలో శబ్దబ్రహ్మము మూలమున పరబ్రహ్మను గ్రహింపవచ్చును.
3. బ్రాహ్మణులు ఉత్తములై వేదచోదిత కర్మలను చేయుచూ (వేదములలో చెప్పబడిన కర్మల ఋక్కులను వల్లెవేయు ఋత్విజులుగ) శాశ్వత పదమును పొందవచ్చును.
4. వేద తాత్పర్యమును తెలిసి వేదితవ్యమును వేదాల్లో చెప్పబడిన ఆంతరంగిక విషయమును తెలుసుకొన్నవాడే వేదజ్ఞుడు.
5. అట్లు కానివారే వేదపాఠపాఠకులు.
6. కావున సర్వము వేదపరిమిశ్రితము. అందువలన నేను వేదమానిత (వేదములను తెలిసిన) బ్రాహ్మణులకు నమస్కరించెదనని పలికెను. ఇక్కడ మనము ఒక శ్లోకమును చెప్పుకొనవచ్చును.

"దైవాధీనం జగత్సర్వం
మంత్రాధీనం తు దేవతా।

తన్మంత్రం బ్రాహ్మణాధీనం
బ్రాహ్మణో మమ దేవతా॥"

అనెడి మాటలు ఇక్కడ గుర్తుకు వచ్చుచున్నవి. అనగా ఈ జగత్తు అంతయూ దైవాధీనము ఆ దైవము మంత్రాధీనము ఆ మంత్రములు బ్రాహ్మణాధీనములు అటువంటి బ్రాహ్మణులు నాకు దేవతలతో సమానమని అర్థము. అనగా వేద బ్రాహ్మణులే భూసురులుగ చెప్పెదరన్న మాటలు గుర్తుకువచ్చుచున్నవి. ఆ మాటలను విని సూర్యరశ్మి ఆనందించి వెడలి పోయెను[1].

## 5. కపిలమహర్షి పుండరీకుని అనుగ్రహించుట

పూర్వము పుండరీకుడను మహారాజు మృగములను వేటాడదలచి అడవిలో యథేచ్ఛగా జంతువులను వేటాడి దాహమును తీర్చుకొనుటకై కపిలముని ఆశ్రమము దగ్గరకల సరోవరమునందు నీళ్ళు త్రాగి అక్కడ తిరుగాడెడి ఒక జింకనుచూచి దానిపై ఒక బాణము వేసెను. ఆ బాణము తగిలి ఆ లేడి కపిలముని ఆశ్రమము దగ్గరకు వచ్చి పడి మరణించెను. అది చూచిన కపిలుడు మిగుల కోపించి తన ఆశ్రమమున ఇట్టి హింసను చేసిన మూర్ఖుడు ఎవరని బిగ్గరగా అరచి ఒక చెట్టు నీడన బాణములతో కూడిన రాజును చూచెను.

అంత కపిలుని చూచిన పుండరీకుడు గడగడవణకుచూ భక్తితో వచ్చి నమస్కరించి తన్నుతాను పరిచయము చేసుకొని తన తప్పును మన్నింపమని ప్రార్థించెను. అంత కోపించిన మహర్షి పుండరీకుని చూసి ఇలా పలికెను. "ఓయీ ! క్షణికకాలములో నశించెడి ఈ శరీరముపై ఆశలు పెట్టుకొని ఈ విధమైన పాపమును చేసితివి. ఇంత దారుణమైన కార్యమును

---

1. ఈ పై విషయమంతయూ భారతమున అనుశాసనిక పర్వమునందు కలదు.

చేయుటకు గల కారణమేమి? రక్తమాంసములతో కూడిన నీ దేహముపై నీ కెట్టి మమత కలదో అలాగే తుచ్ఛమైన నీ విలాసమునకై పసికందు పుణ్యజీవమైన ఈ లేడి నిండు ప్రాణములను బలిగొంటి వేమి? ఇప్పుడు నిన్ను ఏమి చేసినను తప్పులేదు" అని పలికి అతనికి వైరాగ్యముపదేశించెను.

పుండరీకునికి కపిలుడు మాటలాడిన మాటలు బాణముల వలె గుచ్చుకొనగ సిగ్గుపడి తాను చేసిన దోషమునకు అతని ఎదుటనే ప్రాణ త్యాగము చేసుకొనదలచి వాడియగు కత్తిని ఒరనుండి తీసి తన తలను త్రుంచుకొన పోవగ కపిలుడు కరుణించి అతనిని ఆత్మహత్యనుండి కాపాడెను. పుండరీకుడు కపిలుని పాదములపై పడి ప్రాణభిక్షను పెట్టమని కోరెను. అటుపై కొన్ని హితోపదేశములను పుండరీకునికి కపిలమహర్షి బోధించెను.

అవి ఏమనగా -

1. 'మోక్షేతి జ్ఞానమ్ అన్యత్ర విజ్ఞానమ్' అన్నట్లుగ "ఓ రాజా! మోక్షమును అపేక్షించు మానవుడు పూర్వదాన ఫలమున కలిగిన సంపదలు క్షణికము లనియు, పరహింసా వ్యాపారములు పాపహేతువులనియు తెలుసుకొని భయపడుచూ గురుపాదములను ఆశ్రయించవలెను. ఆ గురువు ద్వారానే తత్త్వమును తెలుసుకొని ఆధ్యాత్మిక గమ్యమువైపు చేర ప్రయత్నించవలెను."

2. గురువును ఆశ్రయించి మెలగువారు 3 రకములుగా ఉందురు.

   1. అంకురితులు (మోక్షధర్మమును అపేక్షించువారు)
   2. పుష్పితులు (మోక్షధర్మ ఆచార నిరతులు)
   3. ఫలితులు (జీవన్ముక్తులు)

   వీరు గురుభోదిత మార్గము ద్వారానే సందేశ ఉపదేశములతోనే మోక్షమును పొందుదురు.

ఈ విధముగ బోధించి కపిలుడు అతనిని వీడ్కొలిపి తన ఆశ్రమమునకు వచ్చెను. అటుపై పుండరీకుడు సర్వసంపదలను అసహ్యించుకొని వైరాగ్యముతో కూడుకొన్నవాడై తృణీకరణగా అనుకొని కపిల మహర్షి ఆశ్రమమునకు వచ్చి తనను శిష్యునిగ అనుగ్రహించమని కోరెను. కపిలుడు ఆతనిని కన్నెత్తియైనను చూడక నోట పలుకక తృణీక రించెను. పుండరీకుడు పదమూడు దినములు నీటిని మాత్రమే త్రాగుచు ఏ ఆహారమూ లేక కపిలునినే ధ్యానించుచుండెను.

అటుపై 14వ దినమున కపిలుడు శిష్యసమేతుడై సంధ్యా మొదలైన అనుష్ఠానములను తీర్చుకొని అతనిని పలుకరించి అతనియొక్క మనస్సును ప్రాపంచికమువైపు మరల్చు ప్రయత్నము చేసెను. అతని భార్య రాజ్యసతి అనగ రాజ్యముపైనను భార్యపైనను కుమారులపైనను మరలుకలుగు నట్లుగ ప్రత్నించెను. కాని పుండరీకుడు ఏ ఆహారములేక తపస్సు చేయు చుండెను. అతనిని చూచిన కపిలుడు కర్మ భక్తి జ్ఞాన యోగములు బోధించి క్రింది మంత్రమును ఉపదేశించెను.

> "పరాయ పరరూపాయ పరమాత్మన్ పరాత్మనే
> నమః పరమ తత్త్వాయ పరానందాయ ధీమహి"

పుండరీకుడు అట్లు కపిలమహర్షినే గురువుగా భావించి ఆతని ఉపదేశామృతమున పునీతుడై శ్రద్ధాభయభక్తులతో చిరకాలము ఆ మంత్రమును జపించి విష్ణువుని ప్రత్యక్షము చేసుకొని అతని కటాక్ష వీక్షణమున మోక్షమును పొందెను. ఈ వృత్తాంతము మత్స్య పురాణములో కలదు.

పై విషయములను బట్టి మనము ఆలోచించినచో మనకు ఏ కార్యమైనను ఐహిక, ఆముష్మికములు రెండునూ గురుముఖతః గానే జరుగవలెనని తెలియుచున్నది. భగవత్సాక్షాత్కారముకూడ గురుముఖతఃగానే

జరుగవలెనని తెలియుచున్నది. భగవత్ సాక్షాత్కారముకూడ గురుముఖతః గనే జరుగవలెనని మన హైందవ సిద్ధాంతమునకు కాణాచిగ (గుర్తు) ఇచట పుండరీకుడు రాజైనప్పటికి అతడు విష్ణువును ప్రత్యక్షము చేసుకొని మోక్షము నొందుటకు కపిలమహర్షి గురువుగ అగుట అనియు

"గురుబ్రహ్మ గురువిష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురు సాక్షాత్ పరమ్‌బ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః ॥"

అని తెలియుచున్నది[1]. 'గ' కారమనెడి చీకటి పోగొట్టి, 'ర' కారమనెడి జ్ఞాన జ్యోతిని వెలిగించువాడు గురువు ఒక్కడే అని తెలియుచున్నది.

**6. కపిలమహర్షి సగర పుత్రులను భస్మముచేయుట**

ఒకానొక సమయమున సగర చక్రవర్తి విష్ణుప్రీతికొరకై అనేక అశ్వమేధయాగములను చేసెను. కాని తృప్తిపడక మరియొక యాగము చేయ ఒక అశ్వమును వదలెను. అసూయతో కూడిన ఇంద్రుడు ఆ అశ్వమును నాగలోకమునకు తీసుకొనిపోయి అక్కడ తపోనిష్టలో ఉన్న కపిలమహర్షి ఆశ్రమమున కట్టివేసి వెడలిపోయెను.

అటుపై సగరుడు యాగాఅశ్వమును సంరక్షించుటకై తన కుమారులను పంపెను. వారు ఏడు దీవులు వెతికి అశ్వము కానక భూమిని త్రవ్వి పాతాళలోకమునకు చేరిరి. అచ్చట కపిలమహర్షి ఆశ్రమమునకు ముందున్న గుఱ్ఱమును చూచి ఆ సగరపుత్రులు కపిలమహర్షియే ఆ గుఱ్ఱమును దొంగలించెనని తలచి అతనిని చంప ప్రయత్నించిరి. వెంటనే తపోనిష్ఠలోనున్న కపిలమహర్షి కనులు తెలచి చూడగ వారందరును భస్మీ భూతులైరి. అటుపై సగరుని మనుమడగు అంశుమంతుని పంపగ అతడు

---

1. ఈ వృత్తాంతము మత్స్యపురాణము నందు కలదు.

పాతాళమునకు పోయి అందు కపిలాశ్రమమున భస్మరాశుల చెంతనున్న అశ్వమును చూసి కపిలమహర్షికి మ్రొక్కి అనేక విధముల ప్రార్థించెను.

అటుపై కపిలుడు "ఓ బుద్ధిమంతుడా! గుఱ్ఱమును తోలుకు పోయి మీ తాతయగు సగరుని యజ్ఞము పూర్తి చేయించుము. వెర్రివారలై నీ తండ్రులు ఇచట భస్మమయిపోయిరి. గంగా జలము వీరిపై ప్రవహించిన వీరికి ముక్తి కలుగును"అని అనుగ్రహించెను.

తరువాత అంశుమంతుడు కపిలుని యొక్క అనుగ్రహమునకు పాత్రుడై తండ్రుల దుఃస్థితికి విచారించి యాగాశ్వమును తీసుకొని వెళ్ళి తాతయగు సగరుని యొక్క అశ్వమేధయాగమును పూర్తిచేయించెను. చివరకు భగీరథుడు గంగాజలమును పారింపచేసి సగర పుత్రులకు పుణ్యలోకములొసగెను. దీనిని బట్టి చూడగ ఋషులయొక్క తపోజ్ఞానము వారి ధ్యానశక్తి తపోదీక్ష ఎంతటి మహిమమైనదో మనకు తెలియుచున్నది[1].

### 7. కపిలమహర్షి అశ్వశిరునకు విశ్వరూపము చూపి కటాక్షించుట

పూర్వము అశ్వశిరుడు అను మహారాజు అనేక యాగములను చేసి, అనేక విధముల బ్రాహ్మణులను సత్కరించుచుండెను. కపిల మహర్షి అశ్వశిరుని యోగ్యత తెలిసికొని అతనిని కటాక్షించు ఉద్దేశ్యముతో ఒకసారి "జైగీషవ్యుడు" అను ముని తనతో రాగా అతని ఇంటికి వెళ్ళెను. అశ్వశిరుడు యజ్ఞదీక్షితుడై బ్రాహ్మణులకు అనేక గొప్ప దక్షిణలను ఇచ్చి సన్మానించెను. ఆ సమయమున కపిల జైగీషవ్యులను కూడా ఎంతయో పూజించెను.

అంత అశ్వశిరుడు కపిల మహర్షికి మ్రొక్కి "ఓ స్వామి! నీ రాకచే నేను ధన్యుడనైతిని. విష్ణుమూర్తి కటాక్ష సంపాదనకు నేను ఏమి చేయవలెనో తెలుపు"డని కోరెను. అంత కపిలమహర్షి "రాజా! నేనే విష్ణుమూర్తిని. నన్ను

1. ఈ వృత్తాంతము భారతము, భాగవతము, బ్రహ్మాండపురాణములందు కలదు.

పూజించిన కృతార్థుడవగుదువు. నేను కాక వేరొక విష్ణుమూర్తి కలడని ఎంచుట కన్న అవివేకము లేదని" పలికెను. అశ్వశిరుడు ఆమాటలకు ఆశ్చర్యమును పొంది అతని అహంభావ మునకు అసహ్యించుకొనెను. కపిల మహర్షి ఏమియు అనజాలక ఊరకుండెను. అంత అశ్వశిరుడు "ఓ మహాత్మ! విష్ణుమూర్తిని నేను ఎరుగుదును. అతడు శంఖ చక్ర గదాపాణి, గరుడ వాహనుడు కదా! నీవే విష్ణుమూర్తి అయినచో అవి నీకు లేవు కదా !" అని పలికెను. ఈ మాటలు అశ్వశిరుని నోటినుండి వెలువడగానే కపిల మహర్షి విష్ణురూపుడై, శంఖచక్రగదాపాణి అయ్యెను. జైగదీషవ్యుడును గరుత్మంతుడుగ అతనికి వాహన మయ్యెను. అటుపై అశ్వశిరుడు తన నేత్రములను నమ్మచాలక "అది అంతయు మోసమనియు విష్ణుమూర్తి కమలనాభుడనియు బ్రహ్మ అందుండి జన్మించెననియు అట్లు లేదేమని" అడిగెను.

వెంటనే కపిలమహర్షి కమలనాథుడయ్యెను. జైగీషవ్యుడు బ్రహ్మగా నిలిచెను. అంతకును నమ్మక అశ్వసిరుడు ఇది అంతయు మోసమనెను. కపిలమహర్షి విష్ణుమూర్తికాడు అని పలికెను. అటుపై కపిలుని మాహాత్మ్యమున సభాసదులందరు అంతర్ధానమయ్యిరి. యజ్ఞశాల దుష్ట మృగములతో నిండిపోయినది. ఆ సమయమున భయపడినవాడై అశ్వశిరుడు కపిల మహర్షియే విష్ణుమూర్తి అను పూర్ణ విశ్వాసము కలుగక తిరిగి అతనిని ప్రార్థించెను. వెంటనే కపిలుడు వచ్చెను. సభాసదులు వచ్చిరి. దుష్ట మృగములు అంతర్ధానమయ్యెను. అశ్వశిరుడు కపిలమహర్షి పాదాలమీద పడెను. కపిల మహర్షి అతనిని కటాక్షించి "ఓ రాజా! నీవు విష్ణు భక్తుడవు. విష్ణువును ఎట్లు వశపరచుకొగలవని అడిగెను. బ్రహ్మాది స్థంభ పర్యంతము విష్ణుమూర్తి రూపమని గ్రహించిన ఆతడు నీకు వశడగును. విష్ణువు సర్వాంతర్యామి. అతడే సర్వము అని నిరూపించుటకు ఇట్లు చేసితిని.

ఇప్పుడైనను నీవది గ్రహించి "కులోచిత ధర్మములను వేదవిహిత ఆచారము లను నెరవేర్చుచూ, సుజ్ఞానము పొందిన మోక్షము పొందగలవని" బోధించి కపిలమహర్షి జైగీషవ్యునితో వెడలిపోయెను[1]. ఈ వాక్యమున మనకు తెలియునది ఏమనగ -

"విశ్వం విష్ణుర్వషట్కారో భూత భవ్య భవత్ ప్రభుః
భూతకృత్ భూతకృత్ భావో భూతాత్మా భూత భావనః"

**8. కపిలుని సాంఖ్యసిద్ధాంతము**

కపిల మహర్షి సాంఖ్యాయోగమును బోధించిన మహాత్ముడు. అతని సాంఖ్యసిద్ధాంతములోనే కొన్ని మౌళిక విషయములను ఈ విధంగా తెలుసు కొనవచ్చును.

1. విషయముల విధములు తెలుసుకొని శృతి వాక్యములచే వాని తత్త్వమును గ్రహించి దృఢజ్ఞానముచే వానిని విడిచి పెట్టవలెను.
2. ఆయువు క్షణికమనియు సుఖదుఃఖములు కాలగతి ద్వారా వచ్చు ననియు తెలుసుకొనవలయును.
3. కర్మతత్త్వము వేదచోదముల విధము గ్రహించి సత్త్వము, తమస్సు, రజస్సు గుణములచే బుద్ధికి కలుగు ప్రవర్తనములను గుర్తెఱుంగ వలయును.
4. పంచేంద్రియములు గోష్టమునందు, అగ్ని వాయువులు బయలను పావకునందు తోయమునందు, భూమి తోయములందును, బలము కౌశికునందును, క్రాంతి ఉపేంద్రునందును, అర్ధమున లోభమును మనస్సున, బుద్ధియు రజస్సున, తమస్సును సత్త్వమున, రజస్సును

1. ఈ విషయము వరాహపురాణమున కలదు.

సత్త్వము ఆత్మనందును, ఆత్ముడు నారాయణుడనియు మహేశు డనియు తెలియుచున్నది.

5. ఆత్ముడు పరమున పరము మోక్షమున చేరును. మోక్షము ఇక ఎందును మిళితముకాదు.

6. పదునారు వికారములు కలిగిన ప్రకృతి ఆత్మకు ఆశ్రయము, ఆత్ముడు ప్రకృతి వికృతి అతీతుడు.

7. ఆత్మునకు రెండు రూపములు కలవు. 1. విషయములందును 2. మధ్యస్థభావమునందును ప్రవర్తిల్లును.

8. పంచవాయువులయిన ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానులను ఐదు(5) వాయువులు. వీటి యొక్క జ్ఞానమును అంతరాత్మ చూపును.

9. గర్భవాస దుఃఖము, జన్మవ్యథ, బాల్యవిమూఢత్వము, రాగము, క్లేశము, వార్ధఖ్యము, వీనివలన కలుగు కృపణతలు గుర్తెరిగి సంగమపాసి (వదిలిపెట్టి) ఆత్మను చూచి మోక్షము పొందదగును.

10. దేహ గుణాది దోషములెల్ల త్రోచు మార్గమును గ్రహించి ఆ మార్గ పరిచయమున విష్ణుమాయచే కనబడు విశ్వమంతయు నీటి బుడగగ, నీటి నురగగ, మట్టి కుండగ పోలియున్నదని గ్రహించి దానిని లక్ష్యపెట్టక మోక్షమార్గమును తెలిసికొనుటయే సాంఖ్యము.

పై విధముగ కపిలమహర్షి బోధించిన పదివిషయములగు సాంఖ్య దర్శనము ప్రజాపతి పూజ్యమై వేదశాస్త్ర పురాణవిదిత పరిజ్ఞానములకెల్ల దగ్గరిదై బ్రహ్మజ్ఞానమునకు సరియగునదిగ యున్నది. ఇదియే షడధ్యాయ విరచితమై త్రివిధ దుఃఖ అత్యంత నివృత్తి అత్యంత పురుషార్థాది కనిగదనమై 'కపిలస్మృతి' అని పేరుతో ప్రకాశించుచున్నది[1].

---

1.ఈ విషయము భారత శాంతి పర్వమున కలదు.

### 9. కపిలుని భక్తియోగము

కపిలమహర్షి మాతృదేవికి భక్తియోగమును బోధించెను. తామస రాజస సాత్త్వికములను మూడు విధములుగ భక్తియోగమును గూర్చి చెప్పెను.

1. తామస భక్తుడు - నిత్యము హింసాపరుడై దంభమాత్సర్యాదులకు ఆలవాలమై ఒప్పుచున్నను భేదదర్శియై భగవద్భక్తుడగు తామస భక్తుడు.
2. రాజస భక్తుడు - విషయ సుఖముల ప్రవీణుడై ఐశ్వర్యాదుల అనుభవించుచున్నను భగవద్భక్తి విడవనివాడు రాజసభక్తుడు.
3. సాత్త్వికభక్తుడు - పాపపరిహారమునకై భగవదర్పణ బుద్ధితో కర్మమును చేయుచూ జనహితకారియై భక్తుడగువాడు సాత్త్విక భక్తుడు.

ఇకపోతే పరమాత్ముడనువాడు ఒక్కడున్నాడు. అతని గుణ గణములేమనగ 'పరమేశ్వరుని గుణములను వినుటచే కలిగిన భక్తిచేత నైనను అతనిపై మనస్సును నిలిపినవాడు పరమభక్తుడని' అందురు. పై విధముగ కపిలుడు భక్తియోగమును, తదనంతర ఫలమును విశదీకరించెను[1].

### 10. కపిలమహర్షి రావణునకు విశ్వరూపమును చూపుట

ఒకానొకప్పుడు కపిలమహర్షి పశ్చిమ సముద్ర తీరమున ఒక అరణ్యములో పద్మాసనుడై కనులు మూసుకొని ధ్యాన యోగమున ఆత్మ యోగ సుఖమును పొందుచుండెను. అప్పుడు రావణుడు వరగర్వముచే బలవంతులందరిని జయించు ఉద్దేశ్యముతో తిరుగుచూ కపిలమహర్షిని చూచెను.

రావణుని కంటికి కపిలమహర్షి కనుల అంచులో అగ్ని శిఖలు, బాహువులయందు బహుశిత ఆయుధములు శరీరమంతను మరుత్, వసు,

---
1. ఈ విషయము భాగవతము మూడవస్కంధమున కలదు.

రుద్ర, సంగములు కనబడి దుస్సహముగ కనబడెను. అదియును గాక కపిలమహర్షి హృదయమున - లక్ష్మీ , శల్యమున - మరుద్గణ ములు, కడుపున - సముద్రములు, కన్నుల్లో - సూర్యచంద్రులు, ధాతావిధాతా రుద్రాదులు ముగ్గురు అతని శరీరమున కనబడిరి.

కాని రావణుడు ఇది ఋషుల మాయయని వానిపై అనేక శస్త్రములను ప్రయోగించెను. అంత కపిల మహర్షి "ఓరి ! చెడుగా నన్ను సాధింప వచ్చితివా?" అని పిడికిలితో పొడిచెను. దానితో రావణుడు మూర్ఛ పోయెను. తోటి రాక్షసులు అతనిని ఎదిరించిరి. కపిలుడు రాక్షసులను హూంకరించి గుహలోనికి వెళ్ళెను.అంత రావణుడు కొంత సేపటికి మూర్ఛ నుండి తేరుకొని అతనిని సాధింపనేర్చి బాణముతోడను, కత్తితోడను కపిలుని గుహలోనికి ప్రవేశించెను. అప్పుడు రావణునికి ఆ గుహలో మహావీరులు, దేవసుతులు, సిద్ధులు, శంఖచక్రాదులను ధరించిన చతుర్భుజులైన పురుషశ్రేష్ఠులు కనబడిరి.

ఆ సమయమున మంచి కాంతులతో కూడిన అందమైన రత్న అలంకారములను ధరించిన స్త్రీలు వింజామరలు వీచుచుండగ సౌందర్య నిధియైన ఒక స్త్రీ పాదములు వత్తుచుండగ కపిలమహర్షి కనులు మూసు కొని నిదురించుచుండెను. రావణుడు దగ్గరకు సమీపించగ అతడు లేచెను. రావణుడు ఆశ్చర్యపడినవాడై ఆతని అపూర్వ చరిత్రను అడిగెను.

అంత కపిలమహర్షి రావణుడు త్వరలో చంపబడునుండుట తెలిపి నోరుతెరచెను. అందు విశ్వరూపము ప్రత్యక్షమయ్యెను. రావణుడు ఆ దృశ్యము చూచి భయపడినవాడై అతనికి నమస్కరించి "మాహాత్మా! నీ చేతిలో చనిపోవుటకంటే ఉత్తమము మరియొకటి లేదు. నేనందుకొరకే నిన్ను ఈ విశ్వమున విసుగు విరామములేక వెదకుచున్నానని" అనేక విధముల అతనిని పొగడెను. అంత కపిలుడు పర్వతముతోడను గుహ

తోడను మాయమయ్యెను. అటుపై రావణుడు పరమ ఆశ్చర్యకరమైన మనస్సు కలవాడై వెడలిపోయెను[1].

పై విషయములు బట్టి మనము ఆలోచించగ కపిలమహర్షి సాక్షాత్తు విష్ణుస్వరూపుడనియు ఆ విష్ణువు యొక్క అవతార స్వరూపుడే శ్రీరాముడు అనియు, ఆ శ్రీరాముని చేతిలోనే ఈ రావణాసురుడికి మరణము తప్పదు అనియు ముఖ్యముగ మనకు ఋషుల చరిత్రలో ఇటు రామాయణ కాలంలోగాని అటు భారతకాలంలో కాని అనేక తత్త్వ రహస్యములు వాటి పరిణామములు మార్గదర్శకులైన యోగ జ్ఞాన సంపన్న తపో దీక్షులైన ఋషుల గురించి వారి గొప్పతనము గూర్చి మనకు తెలియుచున్నది.

అదే విధముగ చివరి ముగింపుగ కపిలమహర్షి యొక్క తత్త్వ జ్ఞాన విషయములను ఇలా తెలుసుకొనవచ్చును. కపిల మహర్షి అవతారమ మూలమున లోకమునకు తెలిసినది కపిలాచార్యుని సాంఖ్యతత్త్వము. ఈ సాంఖ్యతత్త్వమూలముననే భక్తియోగమునకు, శృతి స్మృతులకు ప్రామాణ్యము గలిగి విఖ్యాతమయినది. సూర్యరశ్మితో పలికిన పలుకులు వలన కపిలుని వేదప్రామాణ్య బుద్ధి, మాతృమూర్తి అగు దేవహుతికి బోధించిన భక్తియోగము ఇట్లు అనుటకు సాక్షీభూతము.

కావున కపిలమహర్షి తండ్రియగు కర్దమునితో చెప్పినట్లుగ తాను విష్ణువు అవతారమెత్తి మునివేషమును గైకొనుట, ఋషి జనులను తన్మూలమున ప్రజానీకమును, తత్త్వబోధామృతముచే తన సాంఖ్యయోగ ఉపకరణమున పునీతుని చేయుట అనునది నిస్సంశయమైన విషయము.

అందువలన మానవులమైన మనము నేటి కాలమున అటువంటి విష్ణు అంశ జనితుడైన కపిలమహర్షి అమృత వాక్యములైన తన వేదప్రామాణ్య

1. ఈ ఇతి వృత్తము ఉత్తర రామాయణమున కలదు.

సూచనాంశములను అతని సాంఖ్యయోగ బోధనామృత విషయములను గ్రహించి తద్భక్తులుగ మోక్షమార్గ సంధాన మార్గమున జన్మధన్యులుగ ఉందురుగాక.

### కపిలమహర్షి స్తుతి

" విష్ణ్వంశ ఋషీశ్వరా! కపిలనామ! దేవహూతి కర్దముల ప్రియపుత్రా!
విష్ణ్వంశ శోభిత సాంఖ్యయోగ సిద్ధాంత పురుషా! పుండరీక అనుగ్రహా!
విష్ణ్వంశతేజ విశ్వరూప దర్శన పురుషా! సగరపుత్ర భస్మీకృతా!
విష్ణ్వంశ స్థితికార గుణనిధే కపిల మహర్షే! నమస్తే నమో నమః"

❀ ❖❖ ❖ ❀

# 6. కశ్యపమహర్షి

ఒకానొక సమయమున మరీచిమహర్షి బ్రహ్మాదులతో కూడి దేవహూతి కర్దముల ఏకైక కుమారుడైన విష్ణుమూర్తియగు కపిల మహర్షిని చూచుటకై వచ్చెను. ఆ సమయములో కర్దమప్రజాపతి తన తొమ్మిది మంది కుమార్తెలలో మొదటిది అగు 'కళ' అను ఆమెను మరీచునికిచ్చి వివాహము చేసెను. అటుపై మరీచి మహర్షి భార్యయగు కళతో కూడి ఆశ్రమవాసుడై సుఖముగనుండెను.

అటుపై కొన్నాళ్ళకు కళ మరీచిమహర్షి దంపతులకు ఒక మగశిశువు జన్మించెను. మరీచిమహర్షి తన కుమారుడు ప్రజాపతి అగునని అతనిని జాగ్రత్తగ కాపాడమని అతనికి 'కశ్యపుడని' పేరుపెట్టి అతనికి సరియైన కాలమున ఉపనయనాది సంస్కారములనొనర్చి తాను తపోవ్రతమునకు పోయెను.

అనగా నాడు కర్దమ ప్రజాపతిదౌహిత్రుడు, మరీచిమహర్షి కుమారుడు అయిన కశ్యప మహర్షి మరీచిమహర్షి అనుకున్నవిధంగా కశ్యపప్రజాపతిగ పేరుపొందెను.

### 1. కశ్యపమహర్షి సంతానము

కశ్యపుడు పెరిగి పెద్దవాడైన తరువాత దక్షప్రజాపతి తన కుమార్తెలైన అదితి, దితి, దనువు, కాల, అనాయువు, సింహిక, ముని, కపిల, క్రోధ, ప్రథ, క్రూర, వినత, కద్రువలు అను పదమూడు మందిని కశ్యపునికిచ్చి వివాహము చేసెను. ఆ పదమూడు మంది భార్యలతో కశ్యపుడు సంసార సుఖములను పొందినంతట వారికి సంతానము కలిగెను. వారు వరుసగ

1. అదితి - దాత, మిత్రుడు, అర్యముడు, శుక్రుడు, వరుణుడు, అంశుడు, భగుడు, వివస్వంతుడు, పూషుడు, సవిత్రుడు, త్వష్ట, విష్ణుడు అను ద్వాదశ ఆదిత్యులను ప్రసవించెను.
2. దితి - హిరణ్యాక్షుడు, హిరణ్యకశిపుడు జన్మించిరి.
3. దనువు- విప్రచిత్తి, శంబరాది దానవులు నలుగురు జన్మించిరి.
4. కాల - వినాశన, క్రోధ మొదలగు ఎనిమిది మంది జన్మించిరి.
5. అనాయువు - బల, వీరాదులు నలుగురు జన్మించిరి.
6. సింహిక - రాహువు జన్మించెను.
7. ముని - భీమసేన, ఉగ్రసేనాదులను గంధర్వులు కలిగిరి.
8. కపిల - అమృతము, గోగణము, బ్రాహ్మణులు, ఘృతాచి, మేనక మొదలైన అప్సరసలు పుట్టిరి.
9. క్రోధ - క్రోధ వశగణములు పుట్టిరి.
10. ప్రథ - సిద్ధాదులు జన్మించిరి.
11. క్రూర - సుచంద్ర, చంద్రహంత్ర మొదలైనవారు పుట్టిరి[1].

ఈ ఇతివృత్తము భాగవతము చతుర్థ స్కంధమున కలదు. ఈ విధముగ కశ్యప ప్రజాపతి పుత్రులుగ పై వారు ప్రసిద్ధి చెందిరి. ఇకపై కద్రువ, వినతల సంతానము గురించి తెలుసుకొందము.

### 2. కశ్యపునకు కద్రువ, వినతల వలన కలిగిన సంతానము

ఇలా ఉండగ కొంతకాలమునకు కద్రువ, వినతలు ఇద్దరునూ కూడ తమకును సంతానము కలుగ వలెనని కశ్యప మహర్షిని వెయ్యి సంవత్సరములు ఆరాధించిరి. అంత కశ్యపుడు వారి సేవకు సంతోషించి వరములు కోరుకొనమని చెప్పెను. అంత కద్రువ వెయ్యిమందిని కోరుకొనగ, వినత ఆ వెయ్యిమంది కంటే బలాధికులైన ఇద్దరు పుత్రులను కోరుకొనెను.

1. భాగవతము, చతుర్థస్కందమునందు కలదు.

కశ్యపుడు అందుకు అంగీకరించి గొప్ప తపస్సుచేసెను. అటుపై ఇంద్రుడు మొదలైన దేవతలను, వాలఖిల్యులు మొదలైన ఋషిసమూహమును తనకు సహాయకులుగ చేసుకొని పుత్రకామేష్టి యాగమును చేసెను. ఆ యజ్ఞమున అంగుష్టమాత్ర దేహులు, అనవరత ఉపవాస కృశీభూతగాత్రులగు (ఎల్లప్పుడు ఉప వాసముతో కూడి నశించిన శరీరము కలవారు) వాలఖీల్యాదులను చూచి ఇంద్రుడు నవ్వెను. అందుకు వారు ఇంద్రునిపై కోపించి ఇంద్రుడు కంటెను నూరు రెట్లుగల పుత్రుడు కశ్యపునకు కలిగి ఆతడు రెండవ ఇంద్రుడు అగుగాక అని అగ్నిగుండమున మహామంత్రములతో హెూమము గావించిరి. ఆ మాటలను విన్న ఇంద్రుడు తన పదవి ఎక్కడ పోవునో అని భయపడి కశ్యపుని శరణుజొచ్చెను. అంత కశ్యపమహర్షి లోకసంరక్షణార్థమై వాలఖీల్యాది మహర్షులను ప్రార్థించి భువన ప్రవృత్తికి ఆటంకము లేకుండ తనకు పుట్టబోయే కుమారుడు పక్షికులమునకు ప్రభువు అగునట్లుగ ఆ వాలఖీల్యాది మహర్షులను ఒప్పించి శాంతపరచెను. (అతడే వినత కుమారుడైన గరుత్మంతుడు).

అటుపై కశ్యపుడు కద్రువ, వినతల కోర్కె సిద్ధింపచేసి గర్భము సంరక్షించుకొనుడని చెప్పి పంపివేసెను. కొంత కాలమునకు వారి గర్భముల యందు అండములు ఉదయించినవి. వానినెల్ల ఘృత కుండముల పెట్టి ఇరువురు రక్షించుచుండిరి. మొట్టమొదటగ కద్రువ యొక్క గర్భ అండములు చీలి అందు శేషుడు, వాసుకి, తక్షకుడు, కర్కోటకుడు, ధనంజయుడు, కాళీయుడు మొదలగు వేయిమంది నాగముఖ్యులు పుట్టిరి. అటుపై తొందరపడిన వినత తన గర్భాండములనుండి పుత్రులు కలగలేదని విచారించి ఒక అండమును బ్రద్దలుకొట్టగ అందుండి 'అనూరుడు' (తొడలు లేనివాడు) పుట్టి అకాలమున నీవు అండము చిట్లించుటచేత నేను అంగవిహీనుడనైతినని తల్లిని నిందించి, రెండవ అండమైనను జాగ్రత్తగ

కాపాడుకొనమని తల్లికి చెప్పి సూర్యునికి రథసారథి అయ్యెను. చాలా కాలము తరువాత రెండవ అండము నుండి 'గరుత్మంతుడు' ఉదయించెను.

## 3. కశ్యపుడు గరుత్మంతుని ఆశీర్వదించుట

గరుత్మంతుడు ఒకానొకనాడు మాతృదాస్య విమోచనమునకై అమృతమును తెచ్చుటకు తల్లి అనుమతిని కోరి ఆమె చెప్పిన విధముగ సముద్రమునందలి నిషాదులను భక్షించినప్పటికి ఆకలి తీరక తండ్రియగు కశ్యప మహర్షి దగ్గరకు వెళ్ళి ఆహారముకొరకు ఏమి చేయవలెనని అడిగెను.

అంత కశ్యపుడు కుమారుని ధైర్యమును మెచ్చుకొని ఇలా చెప్పెను. "విభావసుడు, సుప్రతీపుడు అను బ్రాహ్మణులు కలహించు కొని కూర్మ గజముఖులై పోరాడుచున్నారు. నీవు వెళ్ళి వారిని భక్షింపుము" అని చెప్పెను. గరుత్మంతుడు తండ్రి ఆజ్ఞగ నలంబ తీర్థమునకు వెళ్ళి రౌహిణముఅను వృక్షముపై వ్రాలగ ఆ చెట్టు యొక్క కొమ్మ విరిగిపోయెను. ఆ సమయమున దానినంటి తపస్సు చేయుచున్న వాలఖీయులకు బాధకలుగకుండ గజకచ్ఛపములను చేతుల ఇరుకించుకొని గంధమాదన పర్వతమున తపస్సుచేయుచున్న తండ్రియగు కశ్యపుని వద్దకు వెళ్ళి నమస్కరించెను. అంత కశ్యపుడు అది గ్రహించి వాలఖీయులను అందుండి మరియొక చోటుకి వెళ్ళమని వేడుకొనెను. వారు ఆ శాఖను విడిచి హిమవత్పర్వతమునకు వెళ్ళిరి. అప్పుడు కశ్యపుడు ఆ శాఖమును నిష్పురుష పర్వతమున విడువమని చెప్పెను. ఆ విధముగ గరుత్మంతుడు రౌహిణి అను చెట్టుయొక్క కొమ్మ నిష్పురుష (ఎవరు లేని చోటు) పర్వతముపై వదలి హిమగిరి పర్వతముపై వ్రాలి గజకచ్ఛపములను భక్షించి మహాబలసంపన్నుడై అమృతమును కొనివచ్చి మాతృశాపవిమోచనమును గావించెను[1].

---

1. ఈ విషయము భారతమున ఆదిపర్వమున కలదు.

**4. భూమి కాశ్యపి అను విధము**

పూర్వము పరశురాముడు ఇరువదియొక్కమారులు నేలను నిఃక్షత్రము చేసి ఆ పాప విముక్తికై అశ్వమేధయాగమును చేసి భూమి నంతయు కశ్యప మహర్షికి దానము ఇచ్చెను.

అటుపై కశ్యపమహర్షి లోకసంరక్షణార్థము అది గ్రహించి రాజ వంశమునకు నిశ్శేషత్వము కలుగకుండుటకై పరశురాముని దక్షిణాబ్ధి పారదేశమునకు పొమ్మని చెప్పెను. అటుపై పరశురాముడు శూర్పాకార ప్రదేశము సముద్రుడు నిజవిహారమును ఇయ్యగా అందు తపోనియతి నుండెను. అటుపై కశ్యపమహర్షి భూమినంతను బ్రాహ్మణులకిచ్చి తాను తపస్సుచేసుకొనుటకై తపోవనమునకు వెళ్లెను. నాటి నుండి భూదేవికి 'కాశ్యపి' అను పేరు కల్గెను.

**5. గంగ కాశ్యపి అనదగిన విధము**

పూర్వము కశ్యపప్రజాపతి మహర్షులను, దర్శించుటకు నైమి శారణ్యమునకు పోయెను. అప్పుడు అందలి ఋషులు బహు భక్తిశ్రద్ధలతో అతనిని పూజించి తమకోరిక నొకదానిని తీర్పమని కోరెరి. అది ఏమనగా సర్వకాల సర్వావస్థలయందు స్నానాదులకు అనుకూలమగు నది ఒకటి కావలయును. నీవు సర్వలోక రక్షకుడవు నీ పేర విలసిల్లునట్లుగ గంగానదిని భూమిపై ప్రవహింపచేసి లోక క్షేమమును చేకూర్చి మా కోరికను తీర్చమని వారు ప్రార్థించిరి.

అంత కశ్యపుడు వారికోరిక మేరకు 'అర్బుదాద్రి'కి వెళ్ళి ఘోరనిష్ఠతో పరమశివుని గురించి చిరకాలము తపస్సుచేసెను. అంత శివుడు కరుణించి ప్రత్యక్షమై వరము కోరుకొనమనగ "స్వామీ! గంగను భూలోకమున ప్రవహింపచేయ"మని కోరెను. శివుడు అందులకు సమ్మతించి, తన

జడనుండి గంగానదిని ఒక పాయగ విడిచెను. కశ్యపుడు ఆ విధముగ కృతార్థుడై పరమశివుని భజించి గంగతో నైమిశారణ్యమునకువెళ్ళి ఋషులను ఆనందింపచేసెను.

అంత ఋషులు మిగుల ఆనందముతో కశ్యపుని అభినందించి, ఆ గంగానదికి 'కాశ్యపి' అని పేరు పెట్టిరి. ఈ కాశ్యపియే నాలుగు యుగములలో నాలుగు పేర్లతో పిలువబడు చున్నది. కృతయుగమున - కృతవతి అనియు, త్రేతాయుగమున - గిరికర్ణిక అనియు, ద్వాపరయుగమున - చందన అనియు, కలియుగమున - సాభ్రమతి అనియు పేరుపొందెను.

ఈ సాభ్రమతీ నది సకల పాపసంహారిణి. ఈ నదీతీరమున అనేక మంది ఋషులు, మహర్షులు తపోనిష్ఠులై నిత్య నివాస ముందురు. వారు వరుసగ - యవ, క్రీత, రైభ్య, భృంగి, అంగిరసుడు, దత్తాత్రేయుడు, విశ్వామిత్రుడు, భరద్వాజుడు మొదలైన వారు. అలాగే ఈ సాభ్రమతీ నదియందు ఇతర నదులును కలిసి ప్రవహించును. అవి ఏమనగ నీలకంఠ, నందహ్రద, రుద్రహ్రద, రుద్రమహాలయ తీర్థములును, మందాకిని, అచ్ఛోద అను నదులు ఇందు గూఢముగ ప్రవహించును. అలాగే ఈ సాభ్రమతి నదీమ్మ తల్లి వల్లనే ఇతరమైన అనేక మహాతీర్థములు ఎక్కువగ ఏర్పడెను.

అవి ఏమనగా - బ్రహ్మచారి, వికీర్ణ, శ్వేత, గణాగ్ని, హిరణ్యా, సంగమ అప్సరస తీర్థములును, కపితీర్థ, మంకితీర్థ, పిప్పలాద, నింబార్క మొదలైన తీర్థములు ఏర్పడినవి.

కశ్యపమహర్షి తపముకావించిన ప్రదేశమునకు కాశ్యపతీర్థమని పేరు. అతడు నిర్మించిన కుండమునకు 'కాశ్యప కుండమని' పేరు. అక్కడ అతడు కుశేశ్వరుని సంస్థాపించెను. ఆ పరిసరములందు ఒక నగరమును నిర్మించెను. అది 'కాశ్యపి' అను పేర కాశీక్షేత్రమునకు సమానముగ ప్రకాశించెను. అలాగే ఇక్కడ మనము మరొక విషయమును కూడా

గుర్తుంచుకొనవలయును. కశ్యప సంబంధమైన ఏ క్షేత్రములను, ఏ తీర్థములను జనులు స్నానమాచరించినను, దర్శించినను సకల పాపక్షయమును పొంది అతడు ముక్తినొందును[1].

## 6. కశ్యపుడు భూమిని రాజులకు పంచి ఇచ్చుట

ఒకానొక సమయములో భూమిపై ధర్మము నశించి అధర్మము పెరిగెను. బ్రాహ్మణులు యజ్ఞయాగాదులను మాని చేయరాని పనులు చేయుచుండిరి. ఈ మహాదోషములను భూదేవి తట్టుకొనలేక పాతాళమునకు పోవుచుండగా కశ్యపమహర్షి తన తొడ గ్రుచ్చి దాపు చేసి ఎత్తగ భూదేవికి మరల పూర్వరూపము కలిగెను. అంత కాశ్యపి కశ్యప మహర్షికి నమస్కరించి ఉత్తమ క్షత్రియులు నన్ను కాపాడునట్లుగ, ధర్మమునురక్షించి తన్నుకూడా సురక్షితముగఉండునట్లు కశ్యపుని కోరెను.

అంత కశ్యపుడు పరశురామునిచే చావని రాజులు ఎవరు అని భూదివిని అడిగెను. అంత భూదేవి సంతసించి హైహయులు కొందరు, పౌరవంశజుడగు విదూరథుని కొడుకును, ఋక్షపర్వతమున ఋక్షములు రక్షించుటయు ఇకపోతే సౌదాసుని వంశమువాడొకడు పరాశరమహర్షి యజ్ఞమున శూద్ర కర్మలు చేయుచూ బ్రతికియుండుటయు, శిబి మనుమడు గోపతి అను వానిని వనమున గోవులు రక్షించుటయు, బ్రతర్ధన పుత్రుడు వత్సరాజు అట్లే జీవించుటయును చెప్పి వారిని పిలిపించి అధిపతులను చేయుమని భూదేవి కశ్యపుని ప్రార్థించెను.

అంత కశ్యపమహర్షి ఆనందించి ఆ రాజ సుతులనందరిని పిలిపించెను. వారందరును వచ్చి కశ్యపునకు నమస్కరించిరి. అటుపై కశ్యపుడు వారందరికి భూమిని విభజించి ఒసగి పరిపాలింపుడని అభిషేక

---

1. ఈ విషయము మనకు పద్మపురాణ - ఉత్తర ఖండమున కలదు.

మాచరించి చెప్పెను. ఇట్లు ఈ క్రమముగ ఆ నృపుల వంశములందు అనేకులు పుట్టి భూమియొక్క భారమును వహింప చేసెను.

**7. కశ్యపుడు అదితి వలన వామనుని కనుట**

పూర్వము ఒకసారి బలిచక్రవర్తి భృగువు మొదలైన బ్రహ్మర్షులను పూజించి గొప్ప బలవంతుడై స్వర్గలోకమును ఆక్రమించెను. ఇంద్రాది దేవతలందరు కామరూపముల ధరించి తమకు ఇష్టము వచ్చిన ప్రదేశములకు వెళ్ళిరి. బలిచక్రవర్తి ఐశ్వర్యముతో తులతూగినవాడు కాగ భృగువు మొదలగు మహర్షులు అతనిచే నూరు అశ్వమేధ యాగములు చేయించిరి.

ఇలా ఉండగా కశ్యపుని భార్య అయిన అదితి తన సవితి బిడ్డల ఐశ్వర్యమును చూచి చింతతో కూడినదై యుండెను. కశ్యపమహర్షి భార్య చెంతకు వచ్చి యోగక్షేమము అడిగెను. ఆ సమయమున అదితి తన బిడ్డల దుస్థితిని తన సవతి దితి బిడ్డల ప్రాబల్యమును చెప్పి తన బిడ్డలను సంరక్షించమని అడిగెను.

ఆ సమయమున కశ్యపప్రజాపతి భవిష్యత్తును ఊహించి నారాయణుని ప్రార్థింపమని తన భార్యయగు అదితికి ఉపదేశించెను. అప్పుడు నేను ఏ వ్రతముచే నారాయణుని ఉపాసింపవలెనని ఆమె కశ్యపుని అడుగగ కశ్యపుడు 'పయోభక్షణము' అను వ్రతమును ఆమెకు ఉపదేశించి తత్కాల మంత్రములను చెప్పెను.

అట్లు భర్త ఉపదేశించినట్లుగ అదితి నారాయణుని ఉపాసించగా నారాయణుడు ప్రత్యక్షమై "నీ కోరికను తీర్చెదను పుత్రోత్పత్తికి భర్తను సేవింపమని" చెప్పి మాయమయ్యెను. అటుపై అదితియు ఆనందముతో భర్తకు సేవచేయుచుండగ ఒకనాడు కశ్యపుడు ఆమెతో భోగించి అచ్యుతుని అంశము ఆత్మలో కలుగగా ఆ ఆత్మను అదితి గర్భమున చేర్చెను. అటుపై

అదితి గర్భవతియై కాలక్రమమున నారాయణుని ప్రసవించెను. దీనిని బట్టి 'ఆత్మావై పుత్రనామాసి' అనగా తండ్రి ఆత్మయే పుత్రుని ఆత్మగా మారునని అర్థముగ ఈ వృత్తాంతము లో తెలిసికొనవచ్చును.

శంఖము, చక్రము, గదాధరుడు, కౌస్తుభ ఆభరణుడు అయిన హరి తన గర్భమున ఎట్లుండెనని అదితి ఆశ్చర్యపడి అడుగగ కశ్యపుడు నారాయణుని అనేక విధముల స్తుతించగ అటుపై నారాయణుడు రూపాంతరమును గ్రహించి వామన అవతారుడై కశ్యపుని ఇంటపుట్టి కాల క్రమేణ పెరిగెను.

కశ్యపమహర్షి మహర్షులతోకూడి అతనికి యుక్తవయస్సున ఉపనయనము చేయ సంకల్పించగ సవిత సావిత్రి ఉపదేశించెను. బృహస్పతి యజ్ఞోపవీతము ఇచ్చెను. కశ్యపుడు మౌంజినిచ్చెను(జింక చర్మము). అదితి కౌపీనమిచ్చెను. బ్రహ్మ కమండలము నిచ్చెను. సరస్వతి అక్షమాలికనిచ్చెను. సప్తర్షులు కుశపవిత్రములిచ్చెరి.

పై ప్రకారము వామనుడు పైవారి చెంత మంగళప్రదముగ అన్నియు గ్రహించి వటుడై తల్లిదండ్రుల ఆజ్ఞగైకొని బలిచక్రవర్తి వద్దకు వెళ్ళి మూడడుగుల దానమునడిగి అతనిని పాతాళలోకమునకు పంపి, స్వర్గలోకము రాజ్యమును తన సోదరులకిచ్చి తల్లియగు అదితి యొక్క కోరికను నెరవేర్చెను[1].

### 8. కశ్యపుడే దశరథుడు, వసుదేవుడగుట

ఒకమారు కశ్యపుడు కద్రువకోరిక తీర్చుటకు కద్రువ సేవలు చేయగా ఆమెతో కామకలాపములు చేయుచుండెను. ఆ సమయము ననే అదితియూ భర్తతో సంభోగమునపేక్షించి నూతన వస్త్రములను

1. మనకు ఈ వృత్తాంతము భాగవతమునందు కలదు.

ధరించినదియై కశ్యపమహర్షి ఆశ్రమమునకు పోయెను. కద్రువ తన భర్త దగ్గర ఆనందముగ ఉన్న సమయమున అదితి మాత్సర్యముతోకూడి తన ప్రయత్నము విఫలమగుటచే వారి ఇరువురిని కోపించి వారిని నరులుగ జన్మించమని శపించెను. కశ్యపుడు ప్రతి జన్మమందును తనకే విష్ణుమూర్తి కుమారిడిగ అవతరింపమని కోరెను. విష్ణుమూర్తి అతని కోరికను అంగీకరించి అదితి కశ్యపులకు వామనుడుగ జన్మించెను. అదితి శాప కారణమున త్రేతాయుగమునందు కశ్యపుడు-దశరథుడుకాగ కద్రువ -కౌశల్యకాగ వారికి శ్రీరాముడు జన్మించెను. ద్వాపర యుగమున వసుదేవుని రూపమునున్న కశ్యపునికి, కద్రువ రూపమునున్న దేవకికి కృష్ణుడు జన్మించెను[1].

పూర్వము ఒకనొకనాడు కశ్యపుడు సముద్రుని హెూమ ధేనువులను అతని అనుమతితో ఇంటికి తోలుకొనిపోయి చిరకాలము ఆ గోవుయొక్క క్షీరమును సేవించెను. అటుపై కొన్నాళ్ళకు సముద్రుడు వచ్చి ఆ హెూమధేనువుని ఇవ్వమని కశ్యపుని కోరెను. ఆ సమయమున కశ్యపుడు ఇచ్చుటకు ప్రయత్నించినను అతని భార్యలగు అదితి, కపిలయును అంగీకరించలేదు. అటుపై సముద్రుడు బ్రహ్మతో చెప్పుకొన్ననూ ప్రయోజనము లేకపోయెను. అంత సముద్రుడు "కశ్యపుడు భూమిపై గోపాలుడై పుట్టుగాక" అని శపించెను. ఆ శాపముచేతనే కశ్యపుడు వసుదేవుడై పుట్టి కంసుని గోగణమునకు అధిపతి అయ్యెను. ఈ విషయము హరివంశమునందు కలదు.

ఇచ్చట మనమొక విషయము ఆలోచించినచో కృతయుగము మొదలు మిగిలిన యుగములలో కూడా పురాణశ్రేష్ఠులగు ఋషులు లోకకళ్యాణము కారణముగ మరు యుగములలో, మరు జన్మలలో, కారణజన్ములుగానే పుట్టుదురనుటకు ఈ కాశ్యపమహర్షి యొక్క

1. బ్రహ్మవైవర్త పురాణమునందు కలదు.

ఇతివృత్తము మనకు ఆధారము. కశ్యపుడు కృతయుగమున దక్షప్రజాపతి కుమార్తెలలో 13 మందిని వివాహము చేసుకొనెను. అంతకు పూర్వము మరీచిమహర్షి కర్దమ ప్రజాపతి దేవహూతుల కుమార్తెయగు కళను వివాహము చేసుకొనెను. ఆ మరీచిమహర్షి యొక్క కుమారుడే కశ్యపుడు. ఈ కశ్యపుడే మహావిష్ణువును ప్రార్థించి తనకు కుమారుడుగ పుట్టమన్నట్లు ప్రార్థించెను. కావున ఏదో ఒక శాప ఇతివృత్త కారణముగ మహావిష్ణువునే కశ్యపుడు తనకు కుమారునిగ పొందెను. అదితి వలన వామనుడు కలిగెను. త్రేతాయుగము దశరథుడుగ, ద్వాపరయుగమున వసుదేవుడుగ మహావిష్ణువుకి తండ్రిగ (త్రేతాయుగముగమున రాముడికి, ద్వాపరయుగమున కృష్ణుడికి) జన్మించెను. దీనినబట్టి చూచినచో ఋషులచరిత్రలు గొలుసు కథగ ఒక యుగమునకు, మరొక యుగమునకు ఒక జన్మకు మరొక జన్మకు ఆధారభూతములుగ గలవని మనకు తెలియుచున్నది. కావున ఈ ఋషుల చరిత్రల సంగ్రహ పరిశీలనలో మనకు ఎన్నో అమూల్యమైన విశేషాంశములతో పూర్వము ఈ ఋషులచరిత్రను పరికించినచో వీరి అమూల్యమైన తపోదీక్ష జ్ఞానసంపదల కారణమున ఉన్నత స్థానమైన "గురుపదవినలంకరించిన దైవప్రతినిధులుగ జ్ఞానకోవిదులుగ కారణజన్ములని అనవచ్చును".

## 9. కశ్యపుని వలన దితికి మరుద్గణములు పుట్టుట

ఇంద్రుడు బలవంతుడై దితికుమారులను బాధించుచుండగ ఒకనాడు దితి భర్తనుచేరి విచారముతో తనకు ఇంద్రుని వంటి బలముకల ఒక కుమారుని ఇమ్మని కోరుకొని అనేక సంవత్సరములు సేవ చేసెను. అంత కశ్యపమహర్షి ఆమె కోరికను చెల్లించెను. దితి గర్భవతి అయి ఉండగ ఇంద్రుడు ఈ విషయమును తెలుసుకొని తన సేవనంగీకరింపమని దితిని కోరగ ఆమె ఆనందముతో అంగీకరించెను.

కాని మోసప్రవృత్తి గల ఇంద్రుడు ఒకనాడు ఆమె అశుచియై శయనించియుండగ ఇంద్రుడు ఆమె గర్భమున ప్రవేశించి, గర్భస్థ శిశువును ఏడు ఖండములుగ చేసెను. అంత ఆ ఖండములు ఏడుగురు శిశువులై విలపించుచుండగ వారినందరిని ఒక్కొక్కరిని ఏడేసి మరల ఇంద్రుడు ఖండించెను. ఈ లోపల దితి మేల్కొని ఈ విషయమును తెలుసుకొని వారతనికి శత్రువులు గాక మిత్రులే అగుదరని రక్షింప వేడుకొనెను. శాంతించిన ఇంద్రుడు వారిననుగ్రహించి వెళ్ళిపోయెను. ఈ విధముగ 7×7=49 మంది పుట్టి మరుద్గణములు అను పేరుతో ప్రకాశించిరి[1].

## 10. కశ్యపుని జ్ఞాన బోధ

కశ్యపుని భార్యలలో దితి, దనువు అను ఇద్దరు ఒకప్పుడు తమ పుత్రులు దేవతల చేతిలో మృతి చెందిరని దుఃఖించుచుండిరి. అప్పుడు కశ్యపుడు వారి వద్దకు వచ్చి ఇటనెను. "ఓ కాంతలారా! పూర్వజన్మ కర్మము అనుభవించక తప్పదు. మీ పుత్రులు శమ దమ దయా ధర్మ నిరతులు కారు. అందుచే వారు నశించిరి. వారికై మీరు దుఃఖింపకూడదు. ఏలననగ దుఃఖము సర్వ ధర్మములను నశింపచేయును. ధర్మక్షయము వలన పుణ్యక్షయము కలుగును. పుణ్యక్షీణతియే సర్వ దుఃఖములకు కారణము. అందుచేతనే మహాఋషులు సంసారము బహుళదుఃఖమునకు కారణమని దానిని అసహ్యించుకొని దాని వలన తమకు దుఃఖము కలుగకుండుటకై ఘోర తపస్సును చేయుచుందురు" అని చెప్పెను.

**వేదాంత బోధ -** నిత్యుడు నిర్వికారుడు నిర్గుణుడు అయిన పరమాత్మ యందు మాయాశక్తివలన పంచతన్మాత్రలు, పంచ భూతములు పుట్టినవి.

1.ఈ ఇతివృత్తాంతము బ్రహ్మపురాణము, మత్స్య పురాణములలో ఉన్నది.

వాని వలన లోకములు, స్థూల శరీరములు మున్నగునవి పుట్టినవి. అలాగే జ్ఞానేంద్రియ, ప్రాణపంచకములు, మనోబుద్ధులు జనించినవి. లింగ సూక్ష్మ కారణశరీరములతో ఐక్యభ్రాంతినొంది పరమాత్మ జీవుడై కర్మఫల భోక్తయగును. జాగ్రత్స్వప్నసుషుప్త్య వస్థాభిమానియై జీవుడు విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడగును. శరీరమునే తాననుకొను జీవుడు గురూపదిష్ట మహావాక్యములచే అపరోక్ష జ్ఞానమొంది పునరావృత్తి రహితమైన మోక్షము నొందును. ధర్మము, శరీరము, సత్యము హృదయమునగు విష్ణుని భజించి తత్కీర్తన స్మరణ పూజా వందనములే జీవుడు జీవత్వభావము విడిచి పరమాత్మతాదాత్మ్యము నందగలడు. ఇట్లు బోధించి వారికి జ్ఞాన సుఖమొసగి కశ్యపుడు తపమునకేగెను[1].

**కశ్యప స్మృతి** - కశ్యప స్మృతి లేక కశ్యప ధర్మ సూత్రములను పేర ఒక ధర్మశాస్త్రము కలదు. స్త్రీ అగ్ని సాక్షిగ వివాహమాడకుండగ తాను తెచ్చుకొన్న స్త్రీ భార్య కాజాలదని, ఆమె దేవపితృకార్యములలో పాల్గొన అర్హురాలు కాదని కశ్యపుడు చెప్పిన శ్లోకమును బోధాయనుడు పేర్కొనెను. విశ్వరూప హరదత్తాదులెల్లరును కశ్యపస్మృతి నుండి ఉదాహరించి ఉన్నారు. ఇదే కశ్యప స్మృతి.

**కశ్యప గీత** - కశ్యప మహర్షి క్షమా గుణమును ప్రశంసించుచు తెలిపిన వాక్యములే కశ్యప గీత అనిపేరు. క్షమ అనగ ఓర్పువహించి ఉండుట. ఇందలి ముఖ్యమైన ప్రధాన భావము ఇలా తెలుపబడినది. వేదములు, యజ్ఞములు, శౌచము, ధర్మము, సత్యము, విద్య, సదాచారము అయిన ఈ ప్రపంచమంతయు ఓర్పుయందే (క్షమయందే) నిలిచి యున్నది. తపస్సులు, అధ్యాయ యజ్ఞకర్తలు, బ్రహ్మవిదులు పొందెడి పుణ్య మార్గములు క్షమకలిగిన వారు పొందెదరు.

---

1. ఈ ఇతివృత్తము పద్మపురాణాంతర్గత భూమిఖండము నందున్నది.

**కశ్యప గీత**

క్షమా ధర్మః క్షమా యజ్ఞః క్షమా వేదా క్షమా శ్రుతమ్
య ఏత దేవం జానాతి ససర్వం క్షంతు మర్హతి
క్షమా బ్రహ్మ క్షమా సత్యం క్షమా భూతం చ భావిచ
క్షమా తపః క్షమా శౌచం క్షమ యేదం ధృతమ్ జగత్
అతియజ్ఞవిదాన్ లోకాన్ క్షమిణః ప్రాప్నువంతి చ
అతి బ్రహ్మ విదాం లోకానతి చాపి తపస్వినామ్
అన్యేవై యజుషాంలోకాః కర్మణామపరే తథా
క్షమావంతాం బ్రహ్మలోకే లోకాః పరమ పూజితాః
క్షమా తేజస్వినాం తేజః క్షమా బ్రహ్మ తపస్వినాం
క్షమా సత్యం సత్యవతాం క్షమా యజ్ఞః క్షమా శమః

**కశ్యపమహర్షి స్తుతి**

"కశ్యపా! కళామరీచి పుత్రా! బ్రహ్మ పౌత్రా! దేవహూతి కర్దమ దౌహిత్రా!
కశ్యప ప్రజాపతే! కద్రూ వినతల పతే! వామన గురుత్మంత పితా!
కశ్యపా! దశరథ వసుదేవ త్రేత ద్వాపరయుగ మరుజన్మ రూపా!
కశ్యపగీత కశ్యపస్మృతి కర్తా! మరుద్గణ పితా! నమస్తే నమస్తే"

ꕥ ❖ ❖ ❖ ꕥ

## సమీక్షానివేదికుల సూచనాంశములు

### (సంగ్రహ ఋషులగాథలు)

# 1, అగస్త్యుడు

వేదాలలోనూ,ఉపనిషత్తులలోనూ,పురాణములలో, కావ్యములలో (ఋషి యొక్క జీవితమును)ప్రస్తుతించిన విషయాంశములు.

**1. యుగము, పురాణగాథ**

అగస్త్యమహర్షి వసిష్ఠమహర్షికి సహజన్ముడు. అనగా యితడు త్రేతాయుగమునకు చెందినవాడు. అష్టదిక్పాలకులకు చెందిన వారైన అగ్ని, వాయుదేవుడు, ఇంద్రుని ఆజ్ఞచే తారకాది రాక్షసులను చంపి నియోగింపబడిరి. కాని వారి ఆజ్ఞను దిక్కరించుటచేత ఇంద్రుని శాపము వలన ఒక అచేతన పదార్థమునుండి మునులై భూభాగమున జన్మించిరి. అటుపై మహావిష్ణువు గంధమాధన పర్వతమున నరకాసురుని అవతార మెత్తి గొప్ప తపస్సు చేయుచుండగ మహేంద్రుడు నారాయణుని చెంతకు అనేక మంది అప్సరసలను తపోభంగము చేయ పంపగా నారయణుడే ఊర్వశినొకదానిని తన ఊరువులనుండి పుట్టించెను. ఆ ఊర్వశిని చూచిన వెంటనే అష్టదిక్పాలకులలో ఇరువురైన సూర్య, వరుణులు ఆమెపై మోహపరవశులైరి. కాని ఊర్వశి మొదట సూర్యుడు తనను కోరుటచే అతని చెంతకు పోవుచుండగ వరుణుడు ఊర్వశితో నీవు నాపై మనస్సు నిడిపొమ్ము అని పలుకగ ఆమె సూర్యుని చెంతకు పోవుచుండగ అది గ్రహించిన సూర్యుడు నీవు వేరొకనిపై మనస్సు పెట్టుకొని, నాచెంతకు వచ్చితివా కావున నీవు భూలోకమున పురూరవు నకు పత్నిగా జన్మించమని శపించెను.

అటుపై ఆమె పైన మోహ పరవశులైన సూర్యవరుణులకు వీర్యపతనమయ్యెను. ఆ సమయము లోనే అగ్నివాయువు మహేంద్రుడు తమకిచ్చిన శాపము వలన అగ్ని సూర్యునిలో, వాయువు వరుణిలో ప్రవేశించి ముని జన్మమును పొందుట వాడు దివ్యదృష్టితో గుర్తించెను. అంత వారిరువురు ఒక కలశములో వారి వీర్యమును వదలి వెళ్ళిరి. అందులోనుంచి జన్మించిన వారే అగస్త్యుడు, వసిష్ఠుడు. అందు వలలనే వీరికి కుంభసంభవులని, కలశజనులని, వహ్ని - మారుత సంభవులని పేరువచ్చెను. ఇది అగస్త్యుడి గురించి పురాణగాథ.

**2. వేదోపనిషత్తులు**

అగస్త్యగీత, అగస్త్యసంహిత, అగస్త్య ఆదిత్యకవచము, ఇవి వేదోపనిషత్తులలో చెప్పబడినది.

**ఆదిత్యకవచము**

"జపాకుసుమ సంకాశం ద్విభుజం పద్మహస్తకం........
అశేషరోగ శాంత్యర్థం ధ్యాయే దాతిత్యమండలం."

**ఆదిత్యస్తోత్రము**

"ధ్యాయేత్సూర్యమనంతకోటి కిరణం తేజోమయం భాస్కరం .......
సూర్యాయ క్షాంతేశాయ నమోనమః
సింధూరవర్ణాయ సుమండలాయ సువర్ణరత్నాభరణాయ తుభ్యం.....
ప్రదత్తమాదాయచ హేమపాత్రే ప్రశస్తనాదం భగవత్ ప్రసీద."

**3. కావ్యములు**

మన ఆదికామ్యమైన శ్రీమద్రామాయణంలో యుద్ధ కాండమున ఆదిత్యహృదయం, రఘువంశోద్ధారకుడైన శ్రీరామ చంద్రునకు యుద్ధ కాండమున రావణాసురుని జయించలేని సమయున కుల దైవమైన

సూర్యుని స్తోత్రమును 32 శ్లోకములలో ''తపోయుద్ధ'' అను మొదలు పెట్టిన ఆదిత్య హృదయస్తోత్రమును ఉపదేశించెను.

### 4. ఋషుల జీవిత మార్గదర్శకములు

అగస్త్య అర్ఘ్యప్రదాన విధానముగ నేటికిని భాద్రపదమాసమున భూలోకమున నక్షత్రరూపములో అగస్త్యుడు ప్రకాశించునని బ్రాహ్మణులు కాశ్యపుష్పముతో అగస్త్యప్రతిమను చేసి ధూపదీప నైవేద్యములతో పూజించిన గొప్ప మోక్షప్రాప్తమిచ్చునని ఈక్రింది శ్లోకములు మనకు ఆదర్శ అగస్త్యమహర్షి నిష్టాగరిష్టత జీవన విధానమునకు మార్గదర్శి కాగలదు.

1. కాశపుష్పప్రతీకాశ వహ్ని మారుతసంభవ..........
రత్నవల్లభ దేవేశ లంకావాస నమోస్తుతే.

2. వాతాపిర్భక్షితో యేన సముద్రశ్లోహితః పురా........
తస్మైనమోస్త్యగస్త్యా సశిష్యాయ చ పుత్రిశే

3. అగస్త్యాయ నమస్తేఽస్తు అగస్త్యేఽస్మిన్ ఘటేస్థితః...........
అపత్యం విమలం సౌఖ్యం ప్రయచ్ఛతు మహామునిః

4. రాజపుత్రి మహాభాగే ఋషిపత్ని వరాననే, లోపాముద్రే
నమస్తుభ్య మర్ఘ్యంమే ప్రతిగృహ్యతామ్.

### 5. అగస్త్యఋషి గూర్చిన ధార్మికమైన మతపరమైన విషయాలు

(1) అగస్త్యమహర్షి జీవితాంతము ప్రసిద్ధ బ్రహ్మవిద్యాబోధనము ఇతని తత్త్వసారము.

శివుడే దాత శివుండె భోక్తశివుడే
చేయున్ మఖాద్రిక్రియల్
శివుడే విశ్వము నేశివుండ..........

అను అద్భుత అద్వైత అనుసంధానమున చెప్పబడినదని చెప్పవచ్చును.

(2) లోపాముద్రతో కూడా తాను భూలోకమున తీర్థస్థానము - క్షేత్రదర్శనములుగ భూలోకమున అనేక తీర్థములను స్నానముచేసిన అష్టాంగయోగమార్గములలో మొదటి రెండు యోగమార్గములైన యమనియమాదులకు తీర్థస్నానములు అవసరమని తీర్థపరమార్థము లను చెప్పిన విధానములు కూడా మనకు ఇతని జీవితము ద్వారా తెలుసుకునవలసిన ధార్మికమైన విషయాంశములని చెప్పవచ్చును. తీర్థములు మానసములు ముక్తిప్రదములు బాహ్యతీర్థావకులు ముక్తిఫలము నీవు.

(3) క్షేత్రదర్శనములలో కోల్హాపుర లక్ష్మీపై స్తోత్రమును కావించెను. అలాగే సమాజ సంక్షేమముకై ప్రకృతికి అడ్డముగ గర్వించి ప్రర్తించిన వింధ్యపర్వతము యొక్క గర్వమును అణచివేసెను. అలాగే శివపురాణమున చెప్పబడిన ఇతివృత్తమునుబట్టి హిమగిరిపై పార్వతీపరమేశ్వరుల వివాహము జరుగుచుండగ ఆ కళ్యాణమును చూచుటకు యక్షకిన్నెర సిద్ధకింపురుషులు ఎందరో ఆ వివాహమునకు వెళ్ళగా ఆ సమయమున భూదేవి దక్షిణదిక్కుకు పైకి లేవగ ఉత్తరదిక్కు లొంగిపోవు సమయమున ఈశ్వరుడు పిలిచి భూదేవి భారము తగ్గుటచే దక్షిణదిశకు వెళ్ళమని ఆజ్ఞాపించెను. ఈవిధముగా శివపురాణము ద్వారా లోకమునకు సహాయభూతుడైన అగస్త్యమహర్షి ఇతివృత్తము అతని జీవితఆధారముగ పరోపకారముగ తెలుసుకొనవచ్చును.

అటుపై దక్షిణదేశయాత్రలు చేయుచూ శ్రీశైలమునకు ప్రదక్షిణ నమస్కారములు గావించిరి. అలాగే దక్షిణదేశమునగల స్వామిలను సతీసమేతముగ కుమారస్వామిని దర్శించెను. అలాగే ఆంధ్రదేశమున కోటిపల్లి, పలివెల, దక్షవాటము అగు భీమేశ్వరుడు, ద్రాక్షారామము,

వీరభద్రశిఖరము, మొదలగు క్షేత్రములను దర్శించి అటుపై మహారాష్ట్ర లోని కొల్హాపురమున లక్ష్మీస్తోత్రమును పఠించెను.ప్రస్తుతము కాలమున వేంకటేశ్వరుడు పద్మావతితో వివాహమైన 6 నెలలపాటు నూతన దంపతులు కొండ ఎక్కకూడదు కావున వారికి 6నెలలపాటు చోటు యిచ్చెను. అదే నేటి శ్రీనివాసమంగా పురముగ పిలువపడి అగస్త్యా శ్రమున అలాగే శ్రీనివాసమంగా పురమునకు సమీపమున ప్రవహించెడి సువర్ణముఖీనదీతీరమున అగస్త్రీశ్వరాలయ మును కూడా ప్రతిష్ఠించెను.

ఇలా ఎన్నో విషయములను ధార్మికములుగ నాటి త్రేతా యుగము మొదలు, నేటి కలియుగము వరకు వారిని గూర్చి చెప్ప బడిన విషయములు అనేకములు పురాణగాథలుగాను, అటు స్కంధ పురాణము, ఇటు శివపురాణము ఆధారముగ మనము తెలుసు కోవచ్చును. ఇంతటి మహోన్నతమైన మహర్షి శ్రీఅగస్త్యమహర్షి యొక్క జ్ఞానమార్గ నిర్దేశకమైన గాథగ మన హైందవ సంస్కృతి ఋషిసంపదగ చదువు రులకు ఆనంద విధితమైనదని చెప్పవచ్చును.

¤❖❖❖❖❖¤

# 2. అత్రిమహర్షి

### 1. యుగము, పురాణేతిహాసములు

పురాణగాథలను బట్టి సప్తర్షులలో ఒకడు దేవహూతి, కర్దమ కుమార్తెలలో ఒకటైన పతివ్రతా శిరోమణియగు అనసూయ భర్త. కర్దమ ప్రజాపతి 9మందికుమార్తెలలో బ్రహ్మర్షులలో ఒకడైన అత్రిమహర్షిని వివాహము చేసుకొనడం విశేషము. ఇతనిని గూర్చి అష్టాదశ పురాణము లలో మార్కెండేయ పురాణం, బ్రహ్మాండ పురాణం, ఆదికావ్యమైన రామాయణం, పంచమ వేదమైన మహాభారతము మొదలైన వాని యందు విస్తరించబడినది. దీనిని బట్టి నాటి త్రేతాయుగములో కూడా అత్రిమహర్షి సీతారాములు అరణ్యవాసము చేయునపుడు భరతుడు శ్రీరాముని పాదుకలను గొని నందిగ్రామము నకు వచ్చిన పిదప శ్రీరాముడు తన భార్యయగు సీతతోను, తమ్ముళ్ళయిన లక్ష్మణ, భరతులతోను అత్రిమహర్షి ఆశ్రమమునకు వచ్చినట్లు చెప్పుటచే ఇతడు త్రేతాయుగమున ప్రసిద్ధి చెందిన వాడుగ చెప్పవచ్చు.

### 2. వేదోపనిషత్తులు

వేదపనిషత్తులో అత్రిసంహిత, అతిస్మృతి విశదీకరించబడినవి. అత్రిసంహితలో ఉత్తమ దైవమెవరు? ఏది పరమధర్మము? ఏది పరమవిధి? పరమేశ్వరుని అర్చించు విధానమేది? అని ప్రశ్నించిరి. దానికి సమాధానముగ అత్రిమహర్షి యిచ్చిన సమాధానమే అత్రిసంహిత అని భృగుడు, కాశ్యపుడు, మరీచి మరియు తాను అంగీకరించిన విషయాంశములే అత్రిసంహితగ పేర్కొనబడినవి. ఇకపోతే ఇందు

అత్రిమహర్షి ఈ అత్రిమహర్షి ఈ అత్రిసంహితను 4 భాగములుగ విభజించెను. (1) కర్మ (2) ప్రతిష్ఠ (3) పూజనము (4) స్నపనోత్సవ ప్రాయశ్చిత్తము. ఇవియన్నియు కూడా దేవతార్చనా విధానము లోకమున తెలియచెప్పి పరమేశ్వర ఉపాసనగ లోకమునకు తగిన తరుణోపాయమును తెలియుచెప్పినవి. అలాగే అత్రిస్మృతిని ఆత్రేయ ధర్మశాస్త్రమని అందురు. ఈ ధర్మశాస్త్రమున 9 అధ్యాయములు కలవు. ధానధర్మములు, జపతపములు, రహస్యప్రాయశ్చిత్తములు యోగ యోగాంగములు కలవు.

ఇవి కాకుండ మరికొన్ని స్మృతి గ్రంధములు కూడా వెలువడినవి. వీనిలో ప్రాయశ్చిత్తములు, దానములు, పితృమేధము, ఆచారములును, గురుప్రశంస, చాతుర్వర్ణధర్మములు, జపమాలం పవిత్రత, బ్రాహ్మణుల కుండవలసిన శౌచానసూయాది సుగుణములు, ఇష్టాపూర్త నిర్వచనము, యమనియమములు, ప్రత్తులు, దత్తపుత్రుల ప్రాయశ్చిత్తులు, ఆశౌచము, చాంద్రాయణకృఛ్ఛ్ర శాంతపనములు, మున్నగు విషములు కలవు. ఇవికాకుండ అత్రి అనసూయ దత్త మీమాంసములో కలదు.

అత్రిననుసరించి అంత్యుజుడు లేడు జాతులవారు, రజకులు, పాదరక్షలు తయారుచేయువారు, నటకులు, బురుదులు, కైవర్తకులు (పల్లెవారు) మేదరులు, భిల్లులు కాని యాత్రావివాహ యజ్ఞాదులలో దాకదగినవారు తాకరానివారు అను విషయమున పట్టింపులేదు. మఱియు లఘ్వత్రిస్మృతి, వృద్ధాత్రేయస్మృతియని రెండుస్మృతులు అత్రిమహర్షి పేరుకాననగుచున్నది.

### 3. జీవనవిధానము

అత్రిమహర్షికి లోకోత్తర పురుషుడైన దత్తాత్రేయుడు, దూర్వాసుడు, క్రమముగ బ్రహ్మవిష్ణుమహేశ్వర అంశములతో జన్మించెను. నేత్ర

గోళమునుండి చంద్రుడుదయించెను. ముఖ్యముగ అనసూయ యొక్క పాతివ్రత్యమును పరీక్షించినవారు బ్రహ్మవిష్ణు మహేశ్వరులు. సూర్యచంద్రులను రక్షించి రాక్షసులను భస్మము చేసినవాడు అత్రి మహర్షి, ఈ అత్రిమహర్షి జీవితమునుండి మనము కొన్ని సన్నివేశములను పైవిధముగ సంగ్రహించుకొనవచ్చును.

¤❖❖❖❖❖¤

## 3. అష్టావక్రమహర్షి

**1. యుగము**

అష్టావక్రుడు కూడా ద్వాపరయుగమునకు చెందినవాడగ చెప్పుకొనవచ్చును. అష్టావక్రుడు అతని పూర్వజీవనము అతని తల్లిదండ్రులైన సుజాత ఏకపాదుల ఇతివృత్తముగ అతని పూర్వజీవిత చరిత్రకూడా ఇతని ఇతివృత్తములో తెలియుచున్నది.

**2. వేదోపనిషత్తులు**

వేదోపనిషత్తులలో జనక చక్రవర్తి త్రేతాయుగమున అతనితో అనేక సంభాషణలను కొనసాగించెను. జనకుని అనుజ్ఞ ప్రకారము వందితో ఎన్నియో తర్క వితర్కములను వాదించెను. ఇవి అన్నియు ఈ అష్టావక్రుని ఇతివృత్తమున చదువరులు తెలుసుకొనగలరు.

ఇకపోతే అద్వైత వేదాంతరహస్యములను జనకమహారాజలకు అష్టావక్రునికి జరిగిన సంభాషణ ఇదియే "అష్టావక్రసంహితగ" కూడా లోకమున ప్రసిద్ధి గాంచినది.

**3. పురాణగాథలు**

పురాణ ఇతివృత్తములను బట్టి అష్టావక్రుడు రంభాదులను శపించినట్లు ఆ రంభాదులను త్రేతాయుగము వాడైన ఈ అష్టావక్రుడు శపించిన కారణముగ వారే ద్వాపరయుగమున విష్ణుమూర్తి కృష్ణావ తారము దాల్చినపుడు గోపికలుగ జన్మించుదురని విష్ణు పురాణమున గ్రహించబడినది. అలాగే అతని వివాహ ఇతివృత్తము బాగా భారత అనుశాసికపర్వము ద్వారా మనకు తెలియుచున్నది.

**4. జీవన విధానము**

అష్టావక్రుడు భగీరథునికి వరప్రాసాదమును ఇచ్చుటచే అతడు సుందరాకృతుడయ్యెను. అలాగే అష్టావక్రుని పూర్వజన్మగాధ బ్రహ్మవైవర్తపురాణము శ్రీకృష్ణఖండమున చెప్పబడినది. ద్వాపర యుగమున అష్టావక్రుడు పుష్కరతీర్థమున పరమవైష్ణవుడై తపస్సు చేసెను. ఒకనాడు మఱ్ఱిచెట్టు క్రింద కూర్చుని రాధమొదలైన భార్యలతో బలారాముడు మొదలైన వారితో కూడియున్నప్పుడు అతడు శ్రీకృష్ణునకు సాష్టాంగ నమస్కారము చేసి చెప్పిన స్తోత్రముకూడా బ్రహ్మవైవర్త పురాణ శ్రీకృష్ణఖండమున కలదు.

వేదోపనిషత్తులలో అష్టావక్రసంహిత చెప్పబడినది. ఇందు ముఖ్యముగ చివరిలో అష్టావక్రుడు శ్రీకృష్ణుని పాదములపై పడి ప్రాణములు వదలవయునని అతని ఉద్దేశ్యము. అలాగే జనక రాజర్షితో అతడు చేసిన అద్వైత వేదాంత రహస్యమే అష్టావక్రసంహితగ లోకమున ప్రసిద్ధిచెందినది.ఇందు ఆత్మోపదేశము, ఆత్మనుభవోల్లాసము, ప్రత్యక్షేప ద్వాపరోపదేశము, ఆత్మజ్ఞాన సంకీర్తనము, లయయోగము, జ్ఞాన యోగము, అనుభవపంచకము, బంధుమోక్షవ్యవస్థ, నిర్వేదము, ఉపశమము, జ్ఞానము, స్వరూపసంస్థితి, ఆత్మసౌఖ్యానుభూతి, శాంతి, తత్త్వోపదేశము, విశేషోపదేశము, తత్త్వజ్ఞస్వరూపము, శాంతిశతకము, ఆత్మస్థితుని యనుభవము, జీవన్ముక్తియను నిరువది అధ్యాయములో ఆయా విషయములద్భుతముగా వివరింపబడినది. ఈ సంహిత నిత్య పారాయణయోగ్యము, ''ఆకాశవదనంతోఽహం, ఘటవత్ ప్రాకృతం జగత్'' ''మహోదదిరివాహం సప్రపంచో వీచిసన్నిభః'' ''అహం వా సర్వభూతేషు'' మున్నగు అద్వైతవేదాంత ఘీంకారవములు అష్టావక్ర మహర్షిని ధన్యాతిధన్యుని చేసివైచినవి.

¤❖❖❖❖❖¤

# 4. ఋష్యశృంగమహర్షి

### 1. యుగము

ఇతడు త్రేతాయుగమునకు చెందినవాడు. పూర్వము కశ్యపుడను మునికి విభాండకుడను కుమారుడు పుట్టెను. అతడు స్నానమునకై కొలనుకు వెళ్ళగా అచట ఊర్వశి తన చెలికత్తెలతో కూడి యుండెను. ఊర్వశిని చూచి కామకృతమైన అతని వీర్యము కొలనులో స్ఖలితమవగా నీరుత్రాగుటకు వచ్చిన ఆడజింక దానిని త్రాగి గర్భము ధరించెను. ఈ విభాండకుని కుమారుడే ఋష్య శృంగుడు.

### 2. పురాణగాథలు

పురాణగాథకు ఈ ఋష్యశృంగుడే పూర్వజన్మశాపకారణముగ జరిగిన ఇతివృత్తముగ ఇంద్రసభలో జరిగిన ఒక ఇతివృత్తము తెలియు చున్నది. ఋష్యశృంగుని తల్లి పూర్వజన్మమున చిత్రరేఖఅను అప్సరస ఆమె ఇంద్రసభలో నాట్యమాడుచుండగ కొన్ని జింకలు అక్కడకు వచ్చెను. నాట్యము చేసెడి అప్సరస ఇంద్రుని చూడక లేళ్ళను చూచు చుండెను. ఆ సమయమున ఇంద్రుడు కోపించి నీవు ఆడజింకవై పుట్టెదవని శపించెను. వెంటనే శాపవిమోచనమును చిత్రరేఖ కోరగ ఇంద్రుడు కరుణించి విభాండకుడను మహర్షి వీర్యము వలన పుత్రుని కనిన పిమ్మట శాపవిమోచనమని పలికెను. ఇది ఋష్యశృంగుని జన్మవృత్తాంతమునకు మూలకథ.

**3. వేదోపనిషత్తులు**

ఋష్యశృంగుని స్మృతి చాలాగొప్పది. ఇందు ఆచారాశౌచ శ్రాద్ధ ప్రాయశ్చిత్తమునకు మితాక్షరాపరార్కస్మృతి చంద్రిక లీస్మృతినుండి తత్సంబంధశ్లోకములనుదాహరించినవి. మితాక్షరమున శంఖునిదని పేర్కొనబడిన యొక శ్లోకమును అపరార్కము ఋష్యశృంగస్మృతి లోనిదని పేర్కొన్నది. స్మృతి చంద్రిక "అపి నాససాయజ్ఞోపవీతార్థాన్ కుర్యాత్. తదభావే త్రినృతాసూత్రేన" అన్న వచనము ఈస్మృతిలోనిదని పేర్కొన్నది. సమగ్రమగుస్మృతి యింకను లభింపవలసియున్నది.

**4. జీవిత విశేషములు, ముఖ్యఘట్టములు**

ఋష్యశృంగుడు అవతారపురుషుడైన శ్రీరామజననమునకు దశరథునిచే అశ్వమేథ పుత్రకామేష్టియాగములను చేయించిన మహనీయుడు. అలాగే వసిష్ఠమహర్షి ఆదరణన దశరథుడు సరయూ నదీ తీరమున యజ్ఞశాలను నిర్మించుటకు ఎన్నో ఆలోచనలను యిచ్చిన మహనీయుడు. ఆదర్శదంపతులుగ పేర్కొనదగిన వారిలో వసిష్ఠుడు - అరుంధతి, అత్రి-అనసూయ, అగస్త్యుడు-లోపాముద్రల వలె ఈ శాంత-ఋష్యశృంగుల దంపతులు మహనీయులు.

**5. ఋషి ప్రత్యేకత**

ఋష్యశృంగుడు 12 సంవత్సరములు యాగము చేసిన మహనీయుడు. అతని జీవన విధానము, ధార్మిక వృత్తి ఎంతో ఆదర్శవంతమైనది. ముఖ్యముగ దశరథుని మిత్రుడగు రోమపాదుడను రాజునకు సంతానము లేకయుండిన ఎంతో సహాయము చేసిన మహిమాన్వితుడు. శాంతారోమపాదులకు సంతానము కలుగుటకై అగ్నిహోత్రాదులను కావించిన మహనీయుడు. ఇలా ఎన్నో విషయము లలో ఆదర్శవంతమైన జీవన విధానమును కలిగిన ధార్మికప్రవృత్తిగల మహిమాన్వితుడు ఋష్యశృంగుడు.

**6. కావ్యములు**

కావ్యములలో ఉత్తరరామాయణమున, వాల్మీకి రామాయణమున ఇతనికి గూర్చిన ప్రస్తానము కలదు. మహాభారత అరణ్యపర్వము నందును ఇతని ఇతివృత్తము చెప్పబడినది.

**7. రచయితగా నా అభిప్రాయము**

(1) ఏది ఏమైననూ ఈ ఋషుల గాథలలో ఈ ఋష్యశృంగుని ఇతివృత్తము వలన మనకు తెలియునది ఏమనగా లోకోద్ధారకుడగు శ్రీరామ అవతారమునకు తన తపోదీక్షతో వేదమంత్ర ఉపనిషత్ వాక్యముల స్మరణతో అశ్వమేధ, పుత్రకామేష్టి యాగములు జరిపించు టకు గురుస్థానమున దశరథునికి సంకల్పసిద్ధిని గావించిన వేదర్షిగ ఋష్యశృంగుని చెప్పవచ్చును.

(2) సామాన్యమైన లోకప్రజలు కూడా తనయొక్క మంత్ర బలమున ఋష్యశృంగస్మృతి అను ఒకదానిని ''ఆయావైదిక కర్మాచరణమునకు పితృదేవతల ఆశీర్వాదమునకు రచించిన ఒక ఆదర్శగ్రంథముగ ఋష్యశృంగ స్మృతిని నిర్మించిన మహనీయుడు. ఈ పై విషయములలో మహిమాన్వితుడైన ఋష్యశృంగుడు త్రేతా యుగమున ప్రసిద్ధిగాంచిన వాడని ఆయా యుగములలో ఆయా ఋషుల ఇతివృత్తముల ప్రత్యేకతలను తెలుసుకొను విధముగ ఈ ఋష్యశృంగుని గూర్చి పరమపుణ్యాత్ముడిగ శాంతాఋష్యశృంగుల ఆదర్శదంపత జీవితముగ కొన్ని సన్నివేశములను ఈ ఋషిగురించి మనము తెలుసుకొనవచ్చును. సమీక్షానివేదికుల సూచనల మేరకు కొన్ని సూక్ష్మాంశములను సంగ్రహించుకొనవచ్చును.

¤ ❖❖❖❖❖ ¤

# 5. కపిలమహర్షి

## 1. యుగము, పురాణగాథలు

కపిలమహర్షి దేవహూతి కర్ధమ ప్రజాపతులకు విష్ణుఅంశమున జన్మించినవాడు. కృతయుగమున కర్ధమ ప్రజాపతి విశ్వసృష్టికై బ్రహ్మచే నియోగింపబడి సరస్వతీ నదీ తీరమున తపస్సు చేసెను. అతడు విష్ణుమూర్తిని ధ్యానింపగ వారికి ఈ దేవహూతి కర్ధముల దంపతులకు తొమ్మిది మంది కుమార్తెలు, ఒక కుమారుడు జన్మింతురని వరమిచ్చెను.

దేవహూతి కర్ధముల కుమార్తెలు వరుసగా కళ, అనసూయ, శ్రద్ధ, హవిర్భువు, గతి, క్రియ, ఖ్యాతి, అరుంధతి, శాంతి.

ఇలా 9మంది కుమార్తెలు అయిన తరువాత ఒకానకరోజున దేవహూతి కర్ధముని తనకు జ్ఞానోపదేశము చేయగల సుకుమారుని ప్రసాదింపమని కోరగ కర్ధముడు మీకు జనార్ధనుడే కుమారుడిగా పుట్టును. కావున ఆయన పాదపద్మములను సేవించమని చెప్పెను. ఆయన సాక్షాత్తు మహావిష్ణువే.

## 2. వేదోపనిషత్తులు

కపిలమహర్షి వేదప్రామాణ్య బుద్ధికలిగిన వాడు. ఉత్తమ ఆకృతియగు గోవును చూచి వేదస్వరూప మనియు, పలికియు నిర్లక్ష్యముగా యుండెను. కొంత దూరమున సూర్యరశ్మియను సంయమి కపిలుని పరీక్షింప ఆ గోవులలో ప్రవేశించెను. చివరకి వేదములే లోకమునకు ప్రమాణములు శ్రద్ధబ్రహ్మ పరబ్రహ్మములలో శ్రద

ధ్బ్రహ్మము మూలమున పరబ్రహ్మము గ్రహించవచ్చును. బ్రాహ్మణులు ఉత్తములై వేదచోదిత కర్మములంజేయుచు శాశ్వతపదము నందవచ్చును. వేదతాత్పర్యమరసి వేదితవ్య మెఱగు వారలే వేదజ్ఞులు. ఇట్లు కానివారు వేదపాఠకులు సర్వము వేదపరినిష్ఠితము. కావున నేను వేదమానిత బ్రాహ్మణులకు నమస్కరింతునని పలికెను. ఈ మాటలను విని సూర్యరశ్మి యానందించి వెడలిపోయెను.

ఉపనిషత్ సారాంశమైన భగవద్గీత సాంఖ్యయోగసిద్ధాంతమును లోకమునకు తెలియచెప్పిన మహనీయులు. అలాగే కపిలమహర్షి మాతృదేవికి భక్తియోగమును బోధించిన మహనీయుడు. ఆత్మ తత్త్వమును గర్భావాసదుఃఖము, జన్మవ్యధ, బాల్య విమూఢత్త్వము, రాగము, క్లేశము, వార్ధఖ్యము, మొదలైన విషయాంశములను సూక్ష్మీకరించిన మహర్షి.

ఇదే విషయమును ద్వాపరయుగ నాధునిగ మహావిష్ణు సంపూర్ణ అవతార పురుషుడుగ అవతరించి అర్జునునికి సాంఖ్య యోగమును బోధించిన మహావిష్ణుస్వరూపుడు.

### 3. కావ్యముల, ఇతిహాసముల యందు ప్రస్తాపన

పంచమవేదమైన భారత శాంతిపర్వమందును, అనునాసిక పర్వమున, భాగవత పురాణ - తృతీయ స్కంధమందును, ఆదికావ్యం రామాయణమునందును, అలాగే ఉత్తరరామాయణమున ఇతని ఇతివృత్తములు కలవు.

### 4. జీవిత ప్రత్యేకతలు

కపిలమహర్షి సగరపుత్రులను భస్మము చేసినవాడు. పుండరీకుని అనుగ్రహించినవాడు. అశ్వసిరునకు విశ్వరూపముచూపి కటాక్షించిన

వాడు. రావణాసురునకు విశ్వరూపము చూపినవాడు. ముఖ్యముగ తల్లియగు దేవహూతికే మోక్షమిచ్చినవాడు. తండ్రియగు కర్దమ ప్రజాపతికే కర్తవ్యమును బోధించినవాడు.

**5. రచయితగా నా అభిప్రాయము**

ఇలా ఎన్నింటికో మూలపురుషుడైన కపిలమహర్షిని గూర్చి ఋషులగాథలలో సాక్షాత్తు మహావిష్ణువు స్వరూపుడిగ, పురాణ పురుషునిగా సాంఖ్యతత్త్వ జ్ఞాన ప్రభోదకునిగ, భక్త యోగములకు శృతి, స్మృతులకు ప్రామాణ్య పురుషునిగ, వేదప్రామాణ్య బుద్ధి మాతృశ్రీ దేవహూతికి మోక్షమార్గ నిర్దేశిక భక్తియోగము, తండ్రియగు కర్దమ ప్రజాపతికి విష్ణుస్వరూపుడిగ తాను కుమారునిగ జన్మించెదనని ముని వేషములో ఋషిజనులకు అందులోనూ తన తొమ్మిదిమంది సోదరీమణులకు తొమ్మిదిమంది ఋషులను జ్ఞానకోవిదులగు ఆదర్శ దంపతులను కావించిన మహనీయునిగను అనేక పురాణేతిహాస కావ్యముల ద్వారా, వేదోపనిషత్తుల ద్వారా ప్రస్తుతించబడిన సాక్షాత్ మహావిష్ణు అంశమైన కపిలమహర్షి జీవిత సన్నివేశములు మన హైందవ సంస్కృతికి ఆదర్శ వంతమైన ఋషి జ్ఞాన నిధిత్త్వమునకు చెప్పుకోదగిన ఋషి గాథలలో కపిలమహర్షిగాథ సభక్తి పూర్వకముగ ప్రాతఃస్మరణీయ ముగ కలిగిన కపిలమహర్షి ఇతివృత్తము సమీక్షానిర్వాహకుల సూచనల మేరకు ఇలా సూక్ష్మీకరించ వచ్చును.

¤❖❖❖❖❖¤

# 6, కశ్యపుడు

## 1. యుగము, పురాణగాథలు

(1) కృతయుగమున కర్ధమ ప్రజాపతి దేవహూతుల కుమార్తె అయిన కళకు బ్రహ్మమానసపుత్రులైన మరీచిమహర్షికి కలిగినవాడే కశ్యపప్రజాపతి. లోకోద్ధరణకై దక్షప్రజాపతి యొక్క కుమార్తెలగు అదితి, దితి, దనువు, కాల, అనాయువు, సింహిక, ముని, కపిల, క్రోధ, ప్రధ, క్రూర, వినత, కద్రువలు అనువారిని వివాహము చేసుకొనెను.

(2) కశ్యపుని వలన ద్వాదత ఆదిత్యులు కలిగిరి. అతనికి కల 13 మంది భార్యలలో యిటు దైవాంశసంభూతులు, అటు రాక్షసాంశ సంభూతులు కూడా జన్మించిరి. అలాగే కద్రువ, వినతలు కూడా కశ్యపుని అనేక సంవత్సరములు ఆరాధించగ కద్రువకు వెయ్యిమంది, వినతకు ఇద్దరు కుమారులు జన్మించిరి.

(3) కశ్యపునికి జన్మించిన సంతానము

**కశ్యపుడు - అదితి**

(ద్వాదశ ఆదిత్యులు)

1. ధాత 2.మిత్రుడు 3.అర్యముడు 4.శుక్రుడు
5.వరుణుడు6.అంశుడు 7.భగుడు 8.వినస్వంతుడు
9.పూషుడు 10.సవితృుడు 11.త్వష్ట 12. విష్ణుడు

2. కశ్యపుడు - దితి

హిరణ్యాక్షుడు, హిరణ్యకశిపుడు జన్మించిరి

3. కశ్యపుడు - దనువు

విప్రచిత్త , శంబరాది దానవులు 40 మంది జన్మించిరి

4. కశ్యపుడు - కాల

వినాశన, క్రోధాదులు 8 మంది జన్మించిరి

5. కశ్యపుడు - అనాయువు

బలవీరాదులు నలుగురు పుట్టిరి

6. కశ్యపుడు - సింహిక

రాహువు జన్మించెను

7. కశ్యపుడు - ముని

భీమసేనోగ్రసేనాదులను గంధర్వులు జన్మించిరి

8. కశ్యపుడు - కపిల

అమృతము, గోగణము, బ్రాహ్మణులు, ఘృతాచీమేనకాదులగు అప్సరసలు పుట్టిరి.

9. కశ్యపుడు - క్రోధ

గ్రోధవశగణములు జన్మించెను

10. కశ్యపుడు - ప్రథ

సిద్ధాదులు జన్మించెను.

11. కశ్యపుడు - క్రూర

సుచంద్ర, చంద్రహంత్రాదులను పుట్టిరి.

పై విషయములన్నియు భాగవతపురాణమున చతుర్థ స్కంధమున కలదు. పై విషయములను బట్టి పరిశీలించినచో పరంజ్యోతి

పరమాత్మప్రతిరూపములైన నిర్గుణస్వరూపమైన జ్యోతితత్త్వము సూర్యనారాయణాది ద్వాదశాదిత్యుల జననీజనకులుగ కశ్యప అదితులకు జన్మించిన ఇతివృత్తము తెలియుచున్నది.

అలాగే రాక్షసులు హిరణ్యాక్షుడు, హిరణ్యకశ్యపుడు దితికి జన్మించినవారు కాగా కృతయుగ అవతారపురుషుడైన నృసింహావతారము హిరణ్యకశ్యపుని, అలాగే హిరణ్యాక్షుని చంపుటక న్నట్లు మహావిష్ణువు (వరాహావతారమున) జన్మించుటకు ఐతిహాస్యమైనది.

వినతకు గరుత్మంతుడు జన్మించుటచే మహావిష్ణువునకు వాహన స్వరూపుడైయ్యెను. ఇలాంటి మహనీయుల కథలన్నియు పురాణగాథలుగ ఈ కశ్యప ప్రజాపతిని గూర్చి సూక్ష్మీకరించు కొనవచ్చును.

**2. జీవిత విశేషములు**

అదితి వలన అవతారపురుషుడైన వామనావతారుడిగ కశ్యపుని వలననే జన్మించినట్లుగ రాక్షసుడైన బలిచక్రవర్తిని సంహరించి లోకోద్ధరణను చేసినట్లుగ తెలియుచున్నది. దీనినిబట్టి కశ్యపుని ఇతివృత్తములో అవతార పురుషునిక జన్మించుటకు మహావతారము, నృసింహావతారము, వామనావతారమునకు కారణమైన ఇతివృత్తి మూలసూచికలుగ హిరణ్యాక్ష, హిరణ్యకశ్యప, బలిచక్రవర్తి ఇతి వృత్తమును కశ్యపునిగాథ మనకు అతని జీవిత విశేషములు మనకు తెలియుచున్నవి.

కాశ్యపి అని పేరు రావటానికి కూడా కారణగాథ అయినది. మహర్షుల కోరికల మేరకు నైమికారణ్యమున తపస్సు చేసుకొనుటకు భూమిపై గంగానది రావటానికి కశ్యపుని యొక్క సహాయము కలిగినది. అర్బుదాద్రి అను పర్వతమున పరమశివుని గూర్చి గొప్ప తపస్సు

చేయగా ఈశ్వరుడు కరుణించి తన జననుండి గంగానది పడుటకు కారణమైనది.

కావుననే గంగానదికి కాశ్యపి అను పేరు. ఇది అతని జీవితము నుండి మనకు తెలిసెడి ఒక సన్నివేశము. గంగానదికి నాలుగు యుగములలో నాలుగు పేర్లు కలవు.

అవి ఏమనగా

కృతయుగమున - కృతీవతి
త్రేతాయుగమున - గిరికర్ణిక
ద్వాపరయుగమున - చందన
కలియుగమున - సాభ్రమతి అని పేర్లు కలవు.

కశ్యపుడు తపస్సు చేసిన చోటుకి కాశ్యపతీర్థమని పేరువచ్చెను. అతడు నిర్మించిన కుండమునకు కాశ్యపకుండమని పేరు వచ్చెను. కాశ్యప అను పేరు కాశీక్షేత్రమునకు సమానముగ పేరుగాంచెను.

ఇతని జీవితములో మరియొక విశేషము తెలిసినది ఏమనగా ఇతడు కారణజన్ముడిగ కృతయుగమున కశ్యపుడయితే, త్రేతా యుగమున - దశరథునిగా, ద్వాపరయుగమున - వసుదేవునిగా జన్మించెను. కృతయుగములో వలె త్రేతాద్వాపరయుగములందు కూడా మహా విష్ణువు అవతారపురుషులైన శ్రీరామచంద్రునకు శ్రీకృష్ణ భగవానునకు కూడా ఈయన తండ్రిగ జన్మించుటకు మనకు తెలుప బడెను.

### 3. పురాణములలో ప్రస్తుతి

బ్రహ్మ, మత్స్య, పద్మపురాణ-భూమిఖండము, హరివంశము మొదలగు పురాణములలో కూడా ఇతని ఇతివృత్తములు కలవు.

లోకమున ప్రసిద్ధులయిన మరుద్గణములను కూడా కశ్యపునికి - దితికి జన్మించినవారే. మొత్తము 49 మంది కుమారులకు మరుద్గణమని పేరు.

**4. వేదోపనిషత్తులు**

వేదోపనిషత్తులలో కశ్యపగీత, కశ్యప స్మృతికలదు. ఇది ఒక ధర్మ శాస్త్రము. ఈ కశ్యప స్మృతిలో ఆయన చెప్పిన కొన్ని ధర్మ సూత్రములను బోధాయనుడు అంగీకరించెను. ఉదాహరణకు అగ్నిసాక్షిగ వివాహమాడక ఇంటనుంచుకొనిన స్త్రీ భార్యకాజాలదని ఆమె పితృకార్యములకు అర్హురాలుకాదని చెప్పెను. అలాగే విశ్వరూప హరిదద్దాలెల్లరును కశ్యపస్మృతినుండి ఉదాహరింపబడెను.

**5. కశ్యపగీత**

కశ్యపమహర్షి క్షమాగుణమును ప్రసరించుచూ తెలిపిన వాక్యములకే కశ్యపగీతయని పేరు. అది ఏమనగా వేదములు, యజ్ఞములు, శౌచము, సత్యము, విద్య, ధర్మము సచరాచర జగమంతయూ క్షమయందే నిలచియున్నవి. కావున తపస్సు, అధ్యయ యగ్నకర్తలు, బ్రహ్మవిధులు పొందు పుణ్యగతులే క్షమావంతులు పొందురు. కశ్యపగీత కశ్యపుడు విరచించినది.

క్షమా ధర్మః క్షమా యజ్ఞః క్షమా వేదా క్షమా శ్రుతమ్
య ఏత దేవం జానాతి ససర్వం క్షంతు మర్హతి
క్షమాబ్రహ్మ క్షమాసత్యం క్షమా భూతం చ భావిచ
క్షమాతపః క్షమాశౌచం క్షమ యేదం ధృతమ్ జగత్
అతియజ్ఞవిదాన్ లోకాన్ క్షమిణః ప్రాప్నువంతిచ
అతిబ్రహ్మవిదాం లోకానతి చాపి తపస్వినామ్

అన్యే వై యజుషాంలోకాః కర్మణామపరే తథా
క్షమావంతాం బ్రహ్మలోకే లోకాః పరమపూజితాః
క్షమాతేజస్వినాం తేజః క్షమా బ్రహ్మతపస్వినాం
క్షమా సత్యం సత్యవతాం క్షమా యజ్ఞః క్షమా శమః

¤❖❖❖❖❖¤

## అష్టాదశ పురాణములు - ఋషుల ప్రస్తావన

**1. శ్రీ బ్రహ్మ మహాపురాణము**

**2. పద్మ మహాపురాణము**

1. చ్యవన మహర్షి చరిత్ర వర్ణనము
2. చ్యవన మహర్షి చరితము
3. వ్యాసుని జననము గూర్చిన కథ
4. మరుత్తుల ఉత్పత్తి - దితి కశ్యపుని వలన గర్భము పొందుట
5. ఋషులు పుష్కర తీర్థము విభాగము చేయుట
6. బ్రహ్మ ఋషులకు వరమిచ్చుట
7. పుష్కర తీర్థ క్షేత్ర మహాత్మ్యము
8. దధీచి వృత్తాంతము
9. రాముడు అగస్త్యాశ్రమమునకు వచ్చుట

**3. శ్రీ విష్ణు మహాపురాణము**

1. భృగు సర్గాది వర్ణనము

**4. శ్రీ వాయు మహాపురాణము**

1. శ్రీ మహాపురాణ వాయుప్రోక్త ఋషి వంశాను కీర్తనం
2. శ్రీ మహాపురాణ వాయుప్రోక్త ఋషి లక్షణము
3. కశ్యపీయ ప్రజాసర్గము - 4 భాగములు

**5. శ్రీమద్భాగవత మహాపురాణము**

1. వ్యాసుని కడకు నారదుడు వచ్చుట
2. శుక మహర్షి పరీక్షిన్మహారాజు వద్దకు ఏతెంచుట
3. శుకుడు పరీక్షిత్తునకు ముక్తిమార్గము తెల్పుట
4. శుకుడు పరీక్షిత్తునకు భక్తిమార్గంబె ముఖ్యమని తెల్పుట
5. కర్దముడు భగవదనుజ్ఞ బడసి దేవహూతిని పెండ్లియాడుట

6. దేవహూతి గర్భమున విష్ణుమూర్తి కపిలాచార్యుడుగా పుట్టుట
7. దేవహూతి పుత్రుండైన కపిలుడు తత్త్వజ్ఞానంబు బడయుట
8. కపిలుడు దేవహూతికి భక్తియోగమును తెలియచేయుట
9. కపిలుడు దేవహూతికి పిండోత్పత్తి క్రమమును తెలియచేయుట
10. గర్భస్తుండగు జీవుడు భగవంతుని స్తుతించుట
11. కర్దమ ప్రజాపతి సంతతిని తెలుపుట
12. ఋషభుండు పుత్రులకు నీతిఉపదేశించుట
13. నారదుడు ధర్మరాజునకు వర్ణాశ్రమ ధర్మంబులు తెలుపుట
14. నారదుని పూర్వజన్మ వృత్తాంతము
15. నారాయణ కవచము
16. మరుద్గణముల జన్మవృత్తాంతము
17. దత్తాత్రేయావతారము, నారాయణావతారము
18. నారద - ప్రచేతస సంవాదము

**6. శ్రీ నారద మహాపురాణము**

1. గౌతమ ఆశ్రమ మహాత్మ్యము
2. మార్కండేయమహర్షి ప్రళయమును దర్శించి, పురాణమును రచించి పరమపదమును చేరమని శ్రీమహావిష్ణువు వరమిచ్చుట
3. బ్రహ్మ సభకు బయలు దేరిన సనక సనందులను గంగా తీరమున నారదమహర్షి విష్ణువును ప్రసన్నుని చేయు ఉపాయమును అడుగగా పురాణోపన్యాసమున విష్ణుస్తుతి
4. భరద్వాజ - భృగు సంవాదమున జగత్సృష్టి నిరూపణము

**7. శ్రీ మార్కండేయ మహాపురాణము**

1. దత్తాత్రేయ మహాత్మ్య వర్ణనము.
2. దత్తాత్రేయ ఉపాఖ్యానము.

**8. శ్రీమదగ్ని మహాపురాణము**

1. దుర్వాసుడు దేవతలను శపించుట.
2. నవవిధ సృష్టి - దక్షకన్యలు భృగ్వాదుల వరించుట
3. సోమాదులు - వాలఖిల్యులు ఉత్పత్తి చెందుట
4. హింసా - ధర్ములకు అనృతాదులు జనించుట
5. అగస్త్య అర్ఘ్యప్రదానము.

**9. శ్రీ భవిష్య మహాపురాణము**

1. బ్రహ్మర్షి సంవాదమున ప్రవర వర్ణనము

**10. శ్రీ బ్రహ్మవైవర్త మహాపురాణము**

1. నారదుడు సృంజయ కన్యను వివాహమాడుట
2. సనత్కుమారుడు స్త్రీ ప్రేమలో పడిన నారదునకు బోధ చేయుట
3. కృష్ణమంత్రోపదేశము
4. నారదునితో శివుడు కృష్ణ ధ్యానాన్ని చెప్పుట
5. యాజ్ఞవల్క్య మహర్షి కృత సరస్వతి స్తోత్రము
6. ఇంద్రునకు దుర్వాస మహర్షి శాపము
7. జమదగ్ని - కార్తవీర్యుల చరిత్ర, యుద్ధము
8. బ్రహ్మ దేవుడు జమదగ్ని - కార్తవీర్యుల యుద్ధమును నివారించుట
9. పరశురాముడు కైలాసమునకు పోవుట.
10. పరశురాముడు శివుని దగ్గర అస్త్రశస్త్ర విద్యలను అభ్యసించుట
11. పరశురామునకు శ్రీకృష్ణ మంత్రోపదేశము
12. పరశురామునకు శ్రీకృష్ణ స్తోత్రమును ఉపదేశించుట
13. కార్తవీర్యుడు పరశురామునితో యుద్ధము చేయుట
14. నారాయణుడు పరశురామునకు శివకవచమును ఉపదేశించుట

15. పరశురామునకు శ్రీమహాలక్ష్మీ కవచము ఉపదేశించుట
16. కైలాసమున గణపతి - పరశురాముల సంవాదము
17. పరశురాముడొనరించిన దుర్గాస్తోత్రము
18. పరశురామునకు భద్రకాళి కవచమును ఉపదేశించుట

**11. శ్రీ లింగ మహాపురాణము**

1. వ్యాస యోగాచార్య నిరూపణము
2. దధీచి - క్షిప సంవాద వృత్తాంతము

**12. శ్రీ వరాహ మహాపురాణము**

**13. శ్రీ స్కాంద మహాపురాణము**

1. ఋష్యశృంగ స్వర్గ ప్రయాణము
2. జైమిని ఋషి సంవాదము
3. బ్రహ్మ ఆజ్ఞచే దేవతలు దధీచి ఆశ్రమమునకు వెళ్ళి దధీచిని అస్థికలిమ్మని ప్రార్థించుట
4. దధీచి యోగమార్గమున తన శరీరము విడచుట
5. దధీచి పత్నియగు సువర్చ దేవతలను శపించుట
6. సువర్చ తన పుత్రుడగు పిప్పలాదుని అశ్వత్థ వృక్షము వద్ద ఉండమని ఆజ్ఞాపించి సువర్చ సమాధి స్థితిలో పతిని అనుసరించుట
7. యజ్ఞవల్క్యుడు నకులను అవమానించుట
8. లోమశ మహర్షి, మార్కండేయ మహర్షి జీవన్ముక్తులగుట
9. అగస్త్య తీర్థ ప్రశంస
10. అగస్త్యుడు వింధ్యపర్వతాన్ని నిగ్రహించుట
11. జటాతీర్థము - భృగువు, దత్తాత్రేయుడు, శుకుడు స్నానము చేసిన చోటు. రాముడు తన జటలను కడిగిన ప్రదేశము

**14. శ్రీ వామన మహాపురాణము**

**15. శ్రీ కూర్మ మహాపురాణము**

1. ఈశ్వర గీత. ఋషి - వ్యాస సంవాదము
2. వ్యాసుని ధర్మోపదేశములు

**16. శ్రీ మత్స్య మహాపురాణము**

1. ఋషి గోత్ర ప్రవర వర్ణము
2. అత్రి గోత్ర ప్రవరాను వర్ణము
3. విశ్వామిత్ర గోత్ర ప్రవరాను కీర్తనము
4. కశ్యప గోత్ర ప్రవరాను కీర్తనము
5. వశిష్ఠ గోత్ర ప్రవరాను కీర్తనము
6. వశిష్ఠ - నిమి చరితము
7. వశిష్ఠ - పరాశర వంశాను కీర్తనము
8. అగస్త్య గోత్ర ప్రవరాను కీర్తనము
9. ధర్మనామ ఋషివంశ వివరణము
10. ఋషుల ప్రశ్నము - మత్స్యావతార కథనము
11. కశ్యప సంతతి
12. మరుదుత్పత్తి - మదన ద్వాదశీ వ్రతము
13. కశ్యపుడు దితికి చెప్పిన గర్భిణీ స్త్రీ ధర్మములు
14. అగస్త్య ఉత్పత్త్యాది కథనము
15. అగస్త్య పూజా విధానము
16. నారదుడు త్రిపురములకేగుట
17. నారదుడు త్రిపురములనుండి తిరిగి వచ్చుట

**17. శ్రీ గరుడ మహాపురాణము**

**18. శ్రీ బ్రహ్మాండ మహాపురాణము**

1. వ్యాస శిష్యోత్పత్తి వర్ణము
2. ఋషి సర్గము వర్ణనము

¤❖❖❖❖❖¤

## అనుబంధము

### రచయిత రచనలు

1. అయ్యప్పస్వామి శరణామృత వర్షిణీ
2. ఓమ్ శ్రీకృష్ణ కరుమారుయమ్మ
3. శ్రీ తలకోన క్షేత్ర మహత్మ్యము
4. నర్రవాడ వెంగమాంబ గొలుగుకథ
5. శ్రీ షిర్డీసాయి సుందరగానములు
6. శ్రీ స్కంద సృష్టి కవచము
7. కార్తీక పురాణము
8. శివ పురాణము
9. మాఘ పురాణము
10. శ్రీకాళహస్తీశ్వర మహాత్మ్యము
11. ద్వాదశ జ్యోతిర్లింగ మహిమ
12. శివరాత్రి మహాత్మ్యము
13. శ్రీ రాహుకేతు దోషనివారణ
14. శ్రీ వైభవలక్ష్మీ మహాత్మ్యము
15. శ్రీలక్ష్మీ శ్రీవేంకటేశ్వర పూజా విధానము
16. భారత భాగవతాల్లో శ్రీకృష్ణుడి పాత్ర
17. శ్రీ తలకోన క్షేత్ర ప్రతిష్ఠా
18. శ్రీ తలకోన సిద్దేశ్వర శివాత్మక శతకము
19. శ్రీ ఆవణి క్షేత్ర మహాత్మ్యము
20. శ్రీ షిర్డీసాయి స్తోత్రమంజరి
21. శ్రీ అరుణాచల మహాత్మ్యము
22. శ్రీ షిర్డిసాయి గానామృతము
23. శ్రీదేవీ దర్శనము
24. శ్రీకృష్ణాపుష్కర మహాత్మ్యము
25. శ్రీశైల క్షేత్ర మహాత్మ్యము

*******